


## ఈ రోజుల్లో తలనొప్పి అంటే మాటలా!

# సాలోఫేన్‌ను వాడండి. అమోఘంగా నొప్పులను నివారించే విశిష్టమైన మాత్ర. వెల అతిచౌక

మంచి నొప్పుల నివారిణి సాలోఫేన్‌ను గమనించండి. దీనిలో రెండు మందులు అమోఘంగా నొప్పులను పోగొట్టేవి చేరివున్నాయి—ఆస్ప్రిన్, ఫెనాసిటిన్—అయినప్పటికీ వెల మాత్రము 7 పైసలే ఒక మాత్ర. సాలోఫేన్ అతిశీఘ్రంగా, తలనొప్పులకు జలుబులకు పండ్లనొప్పి, ఫ్లూ జ్వరాలకు కండలనొప్పులకు ఉపశమనం కలిగిస్తుంది.

సాలోఫేన్ నొప్పుల నివారిణి మాత్రలు—ఏళ్ళతరబడి ఇంటింటా ప్రసిద్ధిపొందిన అమృతాంజన్ లిమిటెడ్ వారి తయారీ.

అమృతాంజన్ లిమిటెడ్ వారి నమ్మకమైన తయారీ

సాలోఫేన్
అమోఘమైన
నిరపాయకరమైన
నొప్పుల నివారిణి

SAA/AMS/2197 TEL

## లోకం పోకడ – ఊమెన్














## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938–1972]
శుక్రవారం : 19-11-'76
నలనామ సం. కార్తీక బ. త్రయోదశి
సంపుటము 70 : సంచిక :12
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ
*
పోస్ట్‌లో ఏడాది చందా రు. 41–60
" ఆరుమాసాల చందా రు. 20–80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ
"కల్పన"లో మురళీమోహన్, జయచిత్ర

# ఉత్తరాలు

### వసూళ్ల చక్రవర్తి

22.10.76 ఆంధ్ర సచిత్రవార పత్రికలో జనగామ్‌నుంచి జి. సురేష్‌గారు 'నటరత్న'ను వసూళ్ళ చక్రవర్తిగా పేర్కొనడం సమంజసంగా లేదని వ్రాశారు. ప్రజలు అంటున్న విజ్ఞప్తి చెప్పటం శ్రీనివాస్‌గారి తప్పా? "రామారావు"గారి చిత్రాలకంటే శోభన్‌బాబుగారి చిత్రాలకు ఎక్కువ కలెక్షన్లు వస్తున్నాయని అన్నారు. ఒక్కసారి వెనక్కి తిరిగి చూస్తే వారి చిత్రాలకు ఎక్కువ కలెక్షన్లు వచ్చాయో తెలుస్తుంది. 25 సం. క్రితం నాటి పాత సినిమాలు ఈ నాటికి కూడ రికార్డు కలెకన్లను అధిగమిస్తున్నాయి. ఈ సం. రం విడుదలయిన 'ఆరాధన, మనుషులంతా ఒక్కటే, మగాడు, నేరం నాదికాదు—ఆకలిది! బంగారు మనిషి చిత్రాల కలెకన్ల ముందు శోభన్‌బాబుగారి "పిచ్చిమారాజు, ప్రేమబంధం, రాజా వెడలె, పొగరుబోతు, మొనగాడు చిత్రాల కలెక్షన్స్ ఎంత? శ్రీ రామారావుగారు కలెక్షన్స్ చూసి సంతోషపడతాడు అన్నారు. అయితే శోభన్ బాబుగారు కలెక్షన్స్ రాకపోయిన 100రోజులు ఆడించుకొని సంతోషపడతాడేమో మరి. ఫెయిలు అయిన 'పిచ్చిమారాజు 100 రోజులు ఆడింది. హిట్ అయిన 'మగాడు' 100 రోజులు ఆడ లేదు. 19 కేంద్రాలలో 100 రోజులు నడిచిన సోగ్గాడు కలెక్షన్స్ 5 కేంద్రాలలో మాత్రమే 100 రోజులు నడిచిన "ఎదురులేని మనిషి" కలెకన్స్ కంటే ఎక్కువ వచ్చినవా? ఎంతో ఆసక్తిదాయకమైన వార్తలు అందిస్తున్నసినిమా రత్న శ్రీనివాస్‌గారిని విమర్శించడం మీకుమంచిది కాదు. ఏమైనా 'శ్రీనివాస్'గారు అన్నట్లు 'శ్రీ రామారావు'గారు 'వసూళ్ళచక్రవర్తియే'.

చిట్టూరి ఇంద్రయ్య, ఎల్. పి. సోమరాజా రావు, (జగన్నాధపురం.)

* * *

22.10.76 సంచికలో ఉత్తరాల శీర్షికలో జి. సురేష్ (జనగామ్) గారు "సూపర్ స్టార్ ఎన్. టి. ఆర్."గారిని వసూళ్ళ చక్రవర్తి అనడం ఏమీ బాగా లేదు అన్నారు. అది ఎన్నటికి నిజం కాదు. ఎందువలనంటే ఏ నిర్మాత అయినా తమ చిత్రానికి ఇతరుల చిత్రాల కన్నా ఎక్కువ కలెక్షన్లు వచ్చినపుడు పేపరులో వేయకుండ ఉండరు. శోభన్‌బాబు గార్కి కలక్షన్లు వచ్చిన వేసే ఉద్దేశ్యం లేదన్నారు. అటువంటప్పుడు వారి చిత్రాలైన జీవనతరంగాలు, మంచి మనుషులు, దేవుడు చేసిన పెళ్ళి, జేబుదొంగ, సోగ్గాడు చిత్రాల కలెక్షన్లను పేపరులో ఎందుకు వేసినట్లు?

'సోగ్గాడు' చిత్రం కలెకన్లు 'ప్రేమనగర్' చిత్రం కలెక్షన్లకన్నా ఎక్కువ వచ్చిందని ప్రతి పేపరు, ప్రతి బుక్సులో శోభన్‌బాబుగారు స్వయంగా ప్రకటన వేయించారు. అలాగే వారు నటించిన "మంచి మనుషులు" చిత్రం కలెకన్లు" 'బంగారు బాబు' చిత్రం కలెకన్ల కంటే ఎక్కువ వచ్చినవి అని పోల్చి మరీపేపరులో వేయించారు. మరి అటువంటపుడు శోభన్ బాబుగార్కి కలెకన్ల దృష్టిలో శ్రద్ధ లేదంటే ఎవరు నమ్ముతారు.!

అటువంటపుడు శోభన్‌బాబు గారి చిత్రాల కలెక్షన్లు రామారావుగారి చిత్రాల కలెక్షన్లకంటే ఎక్కువ వస్తే ఎందుకు ప్రకటించరు?

అందువలన నాటికి— నేటికి— ఏ నాటికి "వసూళ్ల చక్రవర్తి" బిరుదు మన 'నటరత్న' గారికే తగును.

సి.హెచ్. వీరప్రతాప్, డి. హరిబాబు, ఎం. సూర్యనారాయణ, బి. దుర్గాప్రసాద్, పి. శంకర్ రాజమండ్రి)

### అట్టమీద బొమ్మ

29.10.76 దీపావళి సంచిక ముఖచిత్రము కొత్త తరహాలో వుంది. ఎక్కువ పేజీలతో, బహుమతి పొందిన కథలతో'పత్రిక'ఎంతో రిలీఫ్‌నిచ్చింది. ముఖ్యంగా పత్రికలో ముఖచిత్రం విషయములో మీరుతీసుకొంటున్న శ్రమ శ్లాఘనీయం. ప్రతి వారం వ్యాధులకు సంబంధించిన విజ్ఞానశీర్షిక ప్రచురిస్తున్నందుకు మీరెంతైనాఅభినందనీయులు. దీపావళి కార్టూన్స్ ఎంతో హ్యూమరస్‌గా వున్నాయి.

ఆర్వేటి జగదీష్‌గుప్త (కర్నూలు)

* * *

'దీపసుందరి' ముఖచిత్రంతో వెలువడిన ఈ వారం పత్రిక దీపావళి వెలుగులు విరజిమ్మింది. దసరాప్రత్యేక సంచిక చూసి ఎంత విసిగిపోయామో దీపావళి ప్రత్యేక సంచిక చూచి అంత ఆనంద పడుతున్నాను. 8 పేజీలు పెంచి వెలలో మార్పు లేకుండా ప్రత్యేక సంచికగా మీరుతీసుకున్న శ్రద్ధ అభినందనీయం. దీపావళి కథలపోటీలో ఈ వారం ప్రచురించబడిన "ఇంకో సరిత కథ" "గొడుగు" "ఫోటో" కథలు ఫర్వాలేదు. బహుమతి గెలుచుకొతగ్గ ఉత్తమ విలువలు కథలకు యింకారాలేదు. విభిన్న మనుషుల మనస్తత్వాల ఫలితాల ఆధారంగా రచింపబడిన "మజిలీ" కథ వాస్తవిక చిత్రీకరణలో ఉన్నది. "డాక్టరు వనిత" సీరియల్అత్యంతా సక్తిదాయకంగా ఉంటున్నది.

మందలపు రోశయ్య, (బండ్లవారి పాలెం,)

* * *

"దీపావళి సంచిక కొరకు ఎంతో సంబరంగా ఎదురు చూచిన మాకు, సంచిక ముఖచిత్రం చూసేసరికి చాలా అసంతృప్తి కలిగింది. మేము ఊహించిన గెటప్‌లో రాకపోయేసరికి మీపైన కొంచెం కోపం కూడా వచ్చిందంటే నమ్మండి. మా ఆగ్రహాన్ని మా అసంతృప్తిని లోపలి కథలు, శీర్షికలు, పటాసంచలు చేశాయి. "దీపావళి కథల పోటీ' కథలు మూడు మూడు ముత్యాలే.

తులసీ, శ్రీప్రియ, కృష్ణవేణి (ధర్మవరం.)

### కథలు

మా (మీ) ఆంధ్రసచిత్రవారపత్రిక29.10.76 వ సంచిక (దీపావళి సంచిక) సుపర్బ్‌గా వుంది. కథలలో.......ఇంకోసరిత కథ, గొడుగు, ఫోటో ఒక దానిని మించి మరొకటి పాఠకుల నాకట్టుకొనేలా వున్నాయి. ఈ సంచికలోని కథలలో గొడుగు, ఫోటో, కథలు వాస్తవానికి అతి చేరువలోవుంటూ ఈ వారం పత్రికకే హైలైట్‌గా వున్నాయి. ఇక సీరియల్స్‌లో.....డాక్టర్ వనిత, మజిలీ(ముగింపు) ఆసక్తి దాయకంగా ఉన్నాయి.

జ్ఞానంగారి శ్రీహరి, (పీలేరు)

(50వ పేజీ చూడండి)



# మనలో మాట

**దీ**పావళి కథలమీద వ్యాసరచన పోటీలో పాల్గొనేవారు మరొకసారి పోయినవారం సంచికలో మనలోమాట చదవండి. ఆ వివరాలన్నీ యిక్కడ వేయడంలేదు. బ్యాలట్ పత్రం మాత్రం మరోసారి వేస్తున్నాము. పోటీకి పంపే వ్యాసాలతో ఆంధ్ర సచిత్ర వార పత్రికలో వున్న బ్యాలట్ పత్రాన్నే పూర్తిచేసి జతచేసి పంపాలి. బ్యాలట్ పత్రం లేని వ్యాసాలను పరిశీలించడం జరగదు. కాని వ్యాసం లేకపోయినా విడిగా వచ్చే బ్యాలట్ పత్రాలను పరిగణనలోకి తీసుకుంటాము.

పోటీ వ్యాసాలను త్రిప్పిపంపే ప్రసక్తియే లేదు కనుక వాటికి సంబంధించి ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశమే వుండదు. బహుమతులకు మొత్తం రూ. 500లు. మొదటి బహుమతి రూ. 250లు, రెండవ బహుమతి రూ. 150లు, మూడవ బహుమతి రూ. 100లు. బహుమతులు యివ్వడంలో సంపాదకునిదే తుది నిర్ణయం.

---

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

**బ్యాలట్ పత్రం** ముగింపు తేదీ: **20-11-'76**

నాకు నచ్చిన "దీపావళి" పోటీకథ

"......................................................."

పంపినవారి పేరు :

చిరునామా :

వ్యాసం వుంది / లేదు.

సంతకం.

---

## శ్రీ విశ్వనాథ నిర్యాణానికి గవర్నర్ సంతాపం

అక్టోబర్ 18 న విజయవాడలో అస్తమించిన కళాప్రపూర్ణ, పద్మభూషణ, కవిసమ్రాట్ ఇత్యాది బిరుదాంకితులు ఆస్థానకవి, సాహిత్య ప్రక్రియలన్నిటి పారం చూచినవారు, దాదాపు రెండులక్షల పుటల రచనలతో ఆంధ్ర సాహిత్యాన్ని అలంకరించినవారు, ఆత్మగౌరవంతో రచయితలను తల ఎత్తుకొనేట్టు చేసినవారు అయిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ పట్ల గౌరవ సూచకంగా 19 వ తేదీన సాహిత్య అకాడెమీ కార్యాలయం మూసివేశారు. జంట నగరాలలోని పెక్కు సాహిత్య సంస్థలు సంతాపం తెలిపాయి. రాష్ట్ర గవర్నర్ శ్రీ ఆర్.డి. భండారే సంతాపం తెలిపారు. విశ్వనాథ సాహిత్య ప్రక్రియలు దేశవ్యాప్తంగా గుర్తింపు వచ్చిందని, రాష్ట్రమే కాక దేశమే ఒక అమూల్య మణిని కోల్పోయిందని గవర్నర్ విషాదం ప్రకటించారు. భారత మలేషియా తెలుగు మైత్రి సంఘం అక్టోబర్ 20 న కళాభవన్‌లో ఏర్పాటు చేసిన సమావేశంలో డాక్టర్ దివాకర్ల వేంకటావధాని, డాక్టర్ నాయని కృష్ణకుమారి విశ్వనాథ బహుముఖ ప్రజ్ఞను, కరుణాంత

## హైదరాబాద్ నోట్ బుక్

రంగాన్ని వివరించారు. డిసెంబర్ 25 న మరొక సభ జరిపి, అఖిలభారత స్థాయిలో తెలుగు వక్తృత్వపు పోటీలో నెగ్గినవారికి విశ్వనాథ సత్యనారాయణపేర రోలింగ్ షీల్డ్ ఇవ్వడానికి ఈ సంఘం నిర్ణయించింది.

### సోవియట్ నృత్య బృందానికి సత్కారం

నగరంలో మూడు రోజులపాటు నృత్య ప్రదర్శనలు జరిపిన సోవియట్ నృత్య బృందాన్ని రాష్ట్ర సంగీత నాటక అకాడెమీ అక్టోబర్ 21 న ఘనంగా సత్కరించింది. అకాడెమీ అధ్యక్షులు శ్రీ కె. వి. గోపాలస్వామి సోవియట్ బృందానికి స్వాగతం చెప్పారు. కూచిపూడి, జానపద నృత్యాలు ప్రదర్శనం జరిగింది. కుమారి విజయ లక్ష్మి కూచిపూడి నృత్యం చేయగా, ఎం. నరసింహారావు తెలుగు జానపద గీతాలు పాడారు. ప్రతాప్ నెమలి నృత్యం చేశారు. సోవియట్ బృందం ఈ నృత్యరీతులు మెచ్చుకున్నారు. సోవియట్ బృందం కార్యక్రమం మూడవరోజున రవీంద్ర భారతిలో విద్యామంత్రి శ్రీ ఎం. వి. కృష్ణారావు సోవియట్ బృందానికి మొమెంటోలు బహూకరించారు.

### తోలేవానిదే బండి

భారత జాతీయ రవాణా కార్మికసమాఖ్య అధ్యక్షుడు శ్రీ యశ్‌పాల్ కపూర్ అక్టోబర్ 23 న రాష్ట్ర స్థాయి రవాణా సదస్సుకు ప్రారంభోత్సవం జరుపుతూ, ఒకవ్యక్తి పెక్కు వాహనాలకు యజమాని అయి రవాణా రంగం కార్మికులమీద పెత్తనం చెలాయించే రోజులు చెల్లి పోయాయనీ, "నడిపేవాడిదే వాహనం" అనే మంచిరోజులు సమీపించాయని అన్నారు. రవాణారంగం కార్మికుల సమస్యలను రాష్ట్ర ప్రభుత్వం పరిష్కరించ నిశ్చయించిందని కార్మిక శాఖామంత్రి శ్రీ టి. అంజయ్య అన్నారు. లారీలు,టాక్సీలు, ఆటోలు కొనడానికి బ్యాంకుల నుండి ఋణాలు పొందినవారు కిస్తులు పరిగ్గా చెల్లించాలని రెవిన్యూ శాఖామంత్రి శ్రీ నర్సారెడ్డి కోరారు. శ్రీ ప్రగడ కోటయ్య, రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ టి. మునలయ్య ప్రసంగించినమీదట, రవాణా కార్మిక సంఘాధ్యక్షుడు శ్రీ మహమ్మద్ వాహనాలనుకొనడానికి ఇచ్చే ఋణాలపై వడ్డీని నాలుగుశాతానికి తగ్గించాలని కోరారు.

### ఫెరన్ మూకాభినయం

నటనకు అత్యవసరమైన ఆంగిక సాత్త్విక వాచికాహార్యాలలో కేవలం ఆంగిక సాత్త్వికాభినయాలతో మాత్రమే ప్రేక్షకుని అలరింపజేసే అపూర్వకళలో అగ్రగణ్యుడైన హెల్‌ఫ్రెడ్ ఫెరిన్ అక్టోబర్ 22 న దీపావళినాడు రవీంద్ర భారతిలో మాక్స్‌ముల్లర్ భవనం ఆధ్వర్యాన మూకాభినయప్రదర్శనం చేశారు. కీలుబొమ్మలు (డిఫ్పెట్), ద్వంద్వయుద్ధం(డ్యూయెల్), పక్షి (బర్డ్), జాలరి (ఆంగ్లర్), అద్దం (మిరర్), క్రీడలు (గేమ్స్) మరి కొన్ని అంశాలు చూపారు. జాలరి అవస్థ, అద్దంవుందు ఉన్నప్పుడు మానవునిలో కలిగే వివిధ భావాలు, పక్షుల గతులు ఆయన ప్రేక్షక మనోరంజకంగా ప్రదర్శించారు. ఫెరిన్ ప్రస్తుతం జర్మనీలోని టుబింజెన్ నగరం థియేటర్‌లో 'పెల్లర్ డైరెక్టర్‌గా వున్నారు.

### విద్యా విధానాలపై గోష్ఠి

విద్యా విధానాలు—వాటి అమలు అనే అంశం అక్టోబర్ 23 న అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలేజీలో జరిగిన గోష్ఠిలో గవర్నర్ భండారే ప్రసంగిస్తూ, యువకులలో సమైక్యా భావాన్ని పెంపొందించగలిగే నూతన విద్యా విధానాన్ని విశ్వవిద్యాలయాలల్లో ప్రవేశ పెట్టడం అవసరమని సూచించారు. "ఆధు

(49వ పేజీ చూడండి)

# చంద్రునిపైకి విలాసయాత్ర !

రానున్న 1990లో చంద్రమండలానికి వినోదార్థం, విలాసార్థం పోయేసి రావచ్చుని, కనుక తాము ఫ్రమ్ ఎర్త్ టు మూన్ (భూమి నుంచి చంద్రునికి) విమాన సర్వీసులు ప్రారంభించడానికి తీర్మానించుకున్నామని పానామ్ అనే విమాన సంస్థ ప్రకటించిందంట.— టిక్కెట్టెంతో?

## సినిమాహాలు లేని రాజధాని !

సౌదీ అరేబియా దేశానికి ముఖ్య పట్టణమైన జడ్డాలో ఒక్క సినిమా థియేటరు కూడా లేదట. ఆ దేశపు ఆదేశానుసారం అక్కడ సినిమాథియేటరులు, సినిమాలు ఉండరాదుట! వారెట్లుండగలుగుతుండిరి!

## కుడిఎడమైతే పొరపాటే !

అరబ్బు దేశంలో వో అమెరికన్ సబ్బుల కంపెనీ తమ కంపెనీలో తయారు చేసే సబ్బులతో బట్టలుతికితే బ్రహ్మాండగా ఆ బట్టలు తెల్లబడతాయన్న విషయం మూడు బొమ్మలలో ముద్రవేసి, గోడ మీద అతికించారట. వరుసగా చిత్రించిన ఆ మూడు బొమ్మలలో మొదటి బొమ్మలో బాగా మాసిన బట్ట, రెండో బొమ్మలో కంపెనీ తయారు చేసిన సబ్బు, మూడో బొమ్మలో తెల్లగా తళతళలాడే బట్ట ఉందట. అది చూసిన అరబ్బులు ఏమనుకున్నారో గాని, యీ పోస్టర్లు అంటించినాటినుంచి ఆ సబ్బు విక్రయం గాలి తీసిన బెలూనులా చప్పున చల్లారిపోయిందట. దీనికి కారణమేమని విచారిస్తే, అరబ్బులు వారి సంప్రదాయ ప్రకారము దేన్నయినా ఎడమనుంచి కుడికి చదువుతారట! భళి భళి! వెరీ ఫన్నీ!!

## అమెరికాలో మన బీడీలకు గిరాకీ !

ఇండియా నుంచి అమెరికాకు ఎగుమతి అవుతున్న "హరే రామ" బీడీలకక్కడ మాంచి డిమాండుగా ఉంటోందిట. ఇదేమంటే సిగరెట్లలో ఉండే నికోటిన్‌కు పది రెట్లు హరేరామ బీడీలలో నికోటిన్ వుందన్నారట వారు— బట్ హవ్ !

## ఒలింపిక్ రాణి నాయికగా హిందీ సినిమా!

ఈ ఏడు ఒలింపిక్ ఆటలలో బహుమప్రజ్ఞ చూపించి పేరు సంపాదించిన పశ్చిమ జర్మనీకి చెందిన నాడియా కొమిన్సీ అనే అమ్మాయిని హీరోయినుగా పెట్టి, రిషి కపూరును హీరోగా పెట్టి హిందీలో వో సినిమా తీసెయ్యాలని రాజకపూర్ సన్నాహాలు చేస్తున్నారట— ఆతడసాధ్యుడు!



## రోడ్డు ప్రమాదాలు తగ్గితే...!

పెట్రోలు ధర పెరిగినందువల్ల లోగడలా కర్లు నడవటం లేదు. అన్ని కార్లు అంత కోలాహలంగా పోనందువల్ల ఇదివరలా రోడ్డు విపత్తులు జరగటం లేదు. రోడ్డు విపత్తులంత జరగనందువల్ల ఎవరూ రోడ్డు ప్రమాదాలలో చావడంలేదు. అలా ఎవరూ చావనందువల్ల ఆసుపత్రులలో ఉన్న పేషెంట్లలో కొందరికి (అది కావల్సిన వారికి) హృదయం, కిడ్నీలు మొదలయినవి మార్చివేసే ఆపరేషనులు చేయవీల్లేకపోతోందని పాశ్చాత్యదేశాలు— గోల పెట్టేస్తున్నాయట— విపరీత ధోరణి!

## మావో దాతృత్వం

మావోసెటుంగ్ తనకు విదేశ అధికారులు, దేశాలు యిచ్చే గొప్పగొప్ప బహుమతులను తన ఇంట్లో పనిచేసే వారికిచ్చేసి చేతులు దులుపుకునే వారట.

## ఏదొచ్చినా పట్టలేరు !

జిమ్మీకార్టర్ తాను అమెరికా జనాధిపతి అయితే ప్రస్తుతం కిసింజర్ చేస్తున్న పదవికి జ్బిగ్నూబ్రిజిజిన్స్కి అని పలకచ్చు అనే ఆయన్ను నియమించదలచుకున్నట్లు వో ముఖ్య ప్రకటన చేస్తే ఆయన పేరు పలికేదెలా రాసేదెలా ఆయన్ను పిలిచేదెలా, యీ పేరు పలుమారులు అనేదెలా, వినేదెలా అని అమెరికా పేపరులు డీలా పడిపోయాయట. ఏదొచ్చినా అక్కడవుప్రదమేనా!

## తెలుపు నలుపుల తారతమ్యం !

రొడీషియాలో వో తెల్లవాడు చేసే పనికి సంవత్సరానికి ఆరు వేల డాలర్లు ఇస్తారట. అదే పని వో నీగ్రో చేస్తే అతనికి సంవత్సరానికి వెయ్యి ఆరొందల డాలర్లు కన్నా ఇవ్వరట. ఛీ! ఇండియా యీ రాజు బెటర్! స్త్రీలకూ పురుషులకూ ఇక్కడ కూలీ సమమే కదా!

## ఉమ్మడి వంటిల్లు !

స్వీడనులో ప్రతి ఇంటికీ వంటిల్లు ఉండదట. వో అర డజను ఇళ్లకు ఒక వంట ఇల్లు, అక్కడ బోల్డు పొయ్యిలు, బోల్డు వంట పాత్రలూ ఉంటాయట. ఆ ఇళ్ల వాళ్లందరూ అక్కడికే పోయి వంటలు వండుకుని తమతమ ఇళ్లకు తీసుకుని పోతారట. వారానికొకళ్లు చొప్పున వంతులు వేసుకుని వంట ఇల్లూ పాత్రలూ శుభ్రం చేస్తారట. ఫన్నీ యట్టేంట రెస్టింగ్ !

## బోల్టులు, నట్లు మనవే

జర్మనీలో బెంజి కంపెనీవారు తాము తయారు చేసే లారీలకు ట్రక్కులకు కావాల్సిన నట్లను, బోల్టులను మనదేశం నుంచి దిగుమతి చేసుకుంటున్నారట. ●






*(గత సంచిక తరువాయి)*

ఇందిర వెళ్ళిపోయాక పరంధామయ్య రాకపోకలెక్కువయ్యాయి. వచ్చినప్పుడల్లా శారదను వెంటపెట్టుకుని వస్తున్నాడు. కామాక్షమ్మ రమేష్ పనులన్నీ ఆమెకు పురమాయిస్తోంది ఈ అక్కా తమ్ముళ్ళ ప్రవర్తనేమిటో శారదకి ఎబ్బెట్టుగా వుంది కాని తప్పనట్లుగా మాట్లాడక వూరుకుంటోంది.

అంతకీ ఒక రోజున రమేష్ రాత్రి పదకొండు గంటలకు వచ్చాడు. శారదను లేపి అతనికి అన్నం వడ్డించమని పురమాయించి తను పడుకుంది. నిద్ర బద్ధకంచేత నాకు చెప్పి వుంటుందనుకుని వడ్డించబోయింది. "అక్కర్లేదు నేను పెట్టుకుంటానులే" అని రమేష్ పెట్టుకుతిని వెళ్ళిపోయాడు.

మరోరోజు ఉదయం టిఫినిచ్చి 'అబ్బాయి పైనున్నాడు ఇచ్చిరామ్మా' అంది

'అత్తయ్యా ఇన్నాళ్ళూ పనివాళ్ళే చేసేవారు కదా ఇప్పుడీ పనులు కొత్తగా నాకు చెపుతావేమిటి?' అంది.

"అయ్యో తప్పేమిటి వాడేం పరాయివాడా?"

"ఔనత్తయ్యా! పెళ్ళి కావలసినదాన్ని ఎంత బావైనా పరాయి మగాడి పనులు ఇంత స్వతంత్రంగా చేయడం బాగుండదు." అంది.

"ఏమిటే బాగు? ఎల్లాగయినా నీ కాబోయే భర్తే కదా!"

...య్యా!" గద్దించింది.

"అ... నీకు నోరెలావస్తోంది. పెళ్ళా... ఉండగా నీ కొడుక్కి మళ్ళీ పెళ్ళి చేస్తావా? నీ దగ్గర ఎవరూ సుఖపడరు నీకు కోడల్ని చూసుకోవడం, నీ కొడుక్కి భార్యను ప్రేమించడం చాతకాదు. అంత నెమ్మదైన అమ్మాయిని మాటల ఈటెలతో తరిమికొట్టేవు మళ్ళీ నన్ను వలయంలోకి లాగుతున్నావు. నేనలాంటి పిచ్చిపని చేయను. నేనూ ఆడదాన్నే సాటి ఆడదాని స్థానం పోగొట్టి నేను కులకను. మేనత్తవు, నాన్న తీసుకువస్తున్నారు. చూద్దామని వచ్చాను. కాని మీరిలాంటి దురుద్దేశంలో ఉన్నారని తెలియదు. తెలిస్తే రాకపోదును." అంది నిష్కర్షగా.

'అదేమిటే నామీద ఎగురుతావు మీనాన్నే ఇస్తానన్నాడు.'

"ఔను, నీకు తమ్ముడు నాన్న నీలాంటి తుచ్ఛపు బుద్ధులే ఉంటాయి. అందుకే కన్న కూతుర్ని నీ యింట్లో బలికివ్వడానికి సిద్ధమవుతున్నాడు. అన్నీ తెలిసికూడ"

రమేష్ క్రిందకు రాబోయి ఈ సంభాషణంతా విన్నాడు. శారద దగ్గరకు వచ్చి 'నీవేమీ బాధపడకమ్మా! నేనిప్పుడు చేసుకోవడానికి సిద్ధంగాలేను. ఉన్న భార్యనే ఏలుకోలేక సంసారాన్ని నాశనం చేసుకున్నాను. ఇంక మళ్ళీ పెళ్ళేమిటి?' అన్నాడు. తల్లిని కూడ గట్టిగా కేకలేయాలనుకున్నాడు. కాని నోరు రాలేదు మౌనంగా బయటికి వెళ్ళిపోయాడు.

**జరిగిన కథ 2:** లాయరు శ్రీనివాసరావుగారి కూతురు ఇందిరకు రమేష్‌తో పెళ్ళవుతుంది. కోడలు ఇందిర ఉద్యోగం చేయటం ఇష్టం వుండదు కామాక్షమ్మకి. ఇందిరకు కొడుకు పుడ్తాడు. అత్తగారి సూటీపోటీ మాటలు, భర్త నిర్లిప్తతతో మనస్సు విరిగిపోయిన ఇందిర సంసారాన్ని వదులుకుని తల్లిదండ్రుల దగ్గరకు వెళ్ళిపోవాలని నిర్ణయించుకుంటుంది.

పరంధామయ్య రాగానే జరిగిందంతా పూసగ్రుచ్చినట్లుగా చెప్పింది కామాక్షమ్మ. అన్నీ విని అతను శారదను చాటుకి పిలిచి 'ఏమిటి నీ పొగరు? ఇంత ఆస్తి ఉంది. ఒక్కడే కొడుకు. నీ సుఖంకోసమని నేనింత తాపత్రయ పడుతుంటే నీ యిష్టం వచ్చినట్లు వాగుతున్నావు. పెళ్ళంటే మాటలా? పై సంబంధాలు ఎలా తేగలననుకున్నావు? ఇంకా నీ వెనకాల ముగ్గురు మగపిల్లలున్నారు. వాళ్ళని చదివించి ఒక దారిలోకి తీసుకురావాలి నోరు మూసుకు పడుండు" అన్నాడు కోపంగా.

"నాన్నా! నాకు పెళ్ళే వద్దు చెయ్యలేకపోతే మానెయ్యి అంతేకాని ఒకళ్ళని నాశనం చేసి మనం బాగుపడడం తెలివితక్కువ. నేను కూడా కాపురం చేసుకుంటుంటే, నా భర్త మరొకదాన్ని తెచ్చుకుని నన్ను వెళ్ళిపొమ్మంటే ఎలా వుంటుందో ఒక్కసారి ఆలోచించు. అప్పుడు నువ్వూరుకోగలవా? చెప్పనాన్నా? నేనిక్కడ వుండలేను. తక్షణం యింటికి తీసికెళ్ళిపో. ఈ క్షణందాకా నాకేమీ తెలియదు కనుక వుండగలిగేను" అంది ఏడుస్తూ.

"అమ్మా! శారదా. నీ మాటలతో కనువిప్పు కలిగిందమ్మా. ఏదో సుఖపడతావనుకున్నాను. కానీ ఇంకేమీ ఆలోచించలేదు. నీవు నా కెదురు చెప్పవని అడగలేదు. ఈ సంసార విచ్ఛిన్నానికి నేనూ కొంత కారకుడనేనమ్మా" అన్నాడు తల బాదుకుంటూ.

"పోనీలే నాన్నా ఇప్పటికేనా తెలుసుకున్నావు. ఆ ఇందిర బదులుగా నీ కూతురే వుంటే ఏం చేద్దువో అలాగే వాళ్ళ కాపురం బాగుచెయ్యి" అని కర్తవ్యం తెలిపింది శారద.

* * *

బాబుకి మూడు నెలలు వచ్చాయి మనుష్యులను గుర్తు పడుతున్నాడు. బోర్లా పడుక్కుని ఆడుకుంటున్నాడు. ఇందిర శలవు పూర్తయి డ్యూటీలో జాయినయ్యింది. రమేష్ వచ్చాడు. "ఇంక మూడవ నెల వచ్చిందికదా! నాన్న బారసాల అంటున్నారు వస్తావా ఇందిరా" అనడిగేడు ఏమీ జరగనట్లుగా.

"ఆ బారసాలేదో ఇక్కడే చేసుకుంటే మర్యాదగా ఉంటుంది. ఇదిగో చూడండి, నాకు గుంటూరు ట్రాన్స్‌ఫరయ్యింది."

అంటూ కౌగిలించింది.

"అవి చూసి, ఏం చేస్తావు వెడతావా?" తీక్షణంగా అడిగేడు.

"మీరు వెళ్లమంటే వెడతాను. లేకపోతే మీరు వేరే ఉంటానంటే మానేస్తాను" అంది.

"నేను వేరే ఉండడం జరగదు పెద్ద వాళ్లు వాళ్ళని వదిలిపెట్టటం భావ్యంగా ఉండదు." అన్నాడు.

ఏ విషయంలో వాళ్లు పెద్ద. సాటి మనిషిని మనిషిగా గుర్తించక నానా మాటలు అంటుంటే నేనక్కడ ఉండలేను. అని నిష్కర్షగా చెప్పింది. దానితో మాటా మాటా పెరిగి వెళ్ళిపోయాడు.

*　　*　　*

బాబు ఏడుపుతో ఈ లోకంలోకి వచ్చింది ఇందిర. బాబుకి పాలు పడుతూ ఆలోచించ సాగింది. ఏమిటీ బతుకు. ఈ జీవితం ఇలాగే మోడుబారిపోవాలేమో! విధాత తన నుదుట ఏమి వ్రాసాడు? ఏమిటీ కలతలు. ఈ బతుకింత అంధకారమైపోయిందేమి? ఏం చెయ్యాలి ఆ నరకంలోకి వెళ్ళడమా లేక గుంటూరు వెళ్ళి జాయినవ్వడమా? ఏదీ నిర్ణయించుకోలేకపోతోంది.

చివరకు ఈ సమస్యతో సతమతమవ లేక గుంటూరు వెళ్ళి జాయినవ్వాలని నిశ్చయించుకుంది.

గుంటూరు వచ్చినప్పటినుండి ప్రతీవారం రమేష్‌కి, తల్లితండ్రులకు ఉత్తరాలు వ్రాస్తోంది. పది రోజులకోసారైనా తల్లి తండ్రులు జవాబు వ్రాస్తున్నారు. బాబు క్షేమంగా ఉన్నాడని, తన ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోమని, పరిస్థితులకు బాధపడవద్దని సారాంశం. కాని రమేష్ మాత్రం ఎన్ని ఉత్తరాలు వ్రాసినా తిరిగి జవాబు వ్రాయటం లేదు. మనసు మరీ ఆందోళన పడుతోంది. రమేష్‌ని చూడాలని చాలా ఆతృతగా ఉంది. ఎలా భరించాలి ఈ బాధను? ఏమిటి దీని పరిష్కారం. ఇటు ఉద్యోగం వదల్లేదు. అటు వాళ్లింట్లో గడపలేదు. చివరిసారిగా ఒక ఉత్తరం వ్రాసి ప్రాధేయపడాలి అనుకుంది.

శ్రీ రమేష్,

నేను వ్రాసే ఉత్తరాలన్ని అందుతున్నట్లు తలుస్తాను. ఒక్క ఉత్తరానికీ మీరు జవాబు వ్రాయటంలేదు. కారణం ఏమిటో తెలియదు నేనెట్టువంటి అపరాధమైన చేసిఉంటే క్షమించండి. నా భవిష్యత్తు ఏమాలోచించేరు? ఇలానే వెళ్ళనివ్వాలా రోజులు? పెళ్లి కావలసినవాళ్లందరు పెళ్లవలేదని దిగులు పడుతున్నారు. పెళ్లయిన మనలాంటివాళ్ళు జీవితాన్ని అనుభవించలేక పోతున్నారు. నేను మీ మాటకెప్పుడైనా ఎదురు చెప్పేనా? ఏ విషయంలోనైనా మీ అభిప్రాయానికి విరుద్ధంగా మాట్లాడేనా? నన్ను మీరెందుకు నిరసన చేస్తున్నారో అర్థంకావటంలేదు. నా కోసం మీరు వేరే ఉండలేరా? ఈ ఒక్క ప్రార్థన వినలేరా?

నిన్న దీపావళి బాగా జరుపుకున్నారనుకుంటాను. ఏ విషయంలోనూ నేను గుర్తుకు రావటంలేదా? నాలుగేళ్ల సహజీవనాన్ని ఎలా మరచిపోగలిగేరో అర్థంకావటంలేదు. ఈ ఊళ్లోనే మా మేనమామ వరస ఒకాయన ఉన్నారని వ్రాశానుగా. వాళ్లింట్లో నన్ను ఉండమంటే కాదని నేను వేరే ఉంటున్నానని కూడా వ్రాశాను. వాళ్ళు నిన్న నన్ను భోజనానికి రమ్మన్నారు. నేను వద్దు రాలేనన్నా వినిపించుకోకుండా బలవంతంగా ఈడ్చుకు వెళ్లినట్లే తీసికెళ్లేరు. రకరకాల స్వీట్సు నా ముందు వడ్డించేరు. ఏదీ తినాలనిపించలేదు. ఇంతసేపూ మీ గురించి బాధే కాని మరో ధ్యాసలేదు. పోనీ ఉద్యోగం మానేసి అక్కడే ఉందామా అంటే ఎవరికీ సుఖముండదు. ఇంట్లో పరిస్థితితో ఏకీభవించలేము. మీకు చికాకు, నాకు ఏడుపు ఎవ్వరూ సుఖపడలేము. నా జీవితంలో వెలుగు చిమ్మే రోజెక్కడుందోనని వెతుక్కుంటున్నాను. ముచ్చటగా మనిద్దరం కలిసి ఉండే రోజులు వస్తాయా? మన బాబు అమ్మా, నాన్నా, ప్రేమాదరణలతో నవ్వులు చిందిస్తూ మనల్ని మురిపించేరోజు ఎప్పుడు వస్తుంది? ఇలా వ్రాస్తూంటే ఎంతైనా పడుతుంది. ఇప్పటికే మీకు చాలా బోర్‌గా



ఉండనుకుంటా. దీనికైనా త్వరగా మీరు ఉత్తరం వ్రాస్తారని ఆశిస్తూ ముగిస్తున్నాను.

ఇట్లు
కన్నీళ్లతో నమస్కరిస్తూ మీకు అక్కర్లే
కుండా పోయిన ఇందు

* * *

రోజులు దొర్లిపోతున్నాయి. బాబుకి ఏడాదయింది పట్టుకుని అడుగులేస్తున్నాడని వ్రాశారు నాన్న. రమేష్ పూర్తిగా మరిచిపోయారు. పసివాడు బాబుకి తల్లితండ్రుల ప్రేమ ఎలా ఉంటుందో తెలియదు. తను వెళ్ళి నెలకోసారి నాలుగు రోజులు వాడిదగ్గర గడుపుతుంది. కాని వాడికి తండ్రి ప్రేమ ఎలా ఉంటుందో తెలియదు. తన ఆరోగ్యం కూడ ఏమీ బాగుండలేదు. ఇక్కడ ఉండి ఒంటరిగా జీవితం గడపటం కష్టం. విధి తన కిలా వ్రాసి ఉంది తను మాత్రం ఏం చేయగలదు? అత్తవారిల్లు ఆదరణ, భర్త మధురమైన జీవితం అంటారు. తనకి ఏదీ సవ్యంగా లేదు. తన మొహాన అన్నీ గజిబిజిగా ఉన్నాయి. వివాహితకుండే జీవిత మాధుర్యం తనకేనాడు లభించలేదు ఎప్పటికైనా తన కలలన్నీ నెరవేరే రోజు వస్తుందా?

తన జీవితం మీద తనకే నమ్మకంలేదు. ఉద్యోగం రిజైన్ చేసేసింది. చివరి రోజులైనా బాబుతో గడపాలని. ఏమిటో ఆలోచిస్తున్నకొద్దీ మరీ బెంగగా ఉంది. వాడు

# వ్యక్తిత్వంలేని వ్యక్తి

తల్లిని మరచి ఉండగలడా? తల్లిలేని బాబు ఎలా ఉంటాడు? ఈ ఊహకే ఒళ్ళు జలదరిస్తోంది. అప్పుడే తను గుంటూరు వదిలిపెట్టి నెలవ్వస్తోంది. వారం రోజుల క్రితం జరిగిన సంఘటన గుర్తుకువస్తేనే గుండె దడదడలాడుతోంది.

ఈమధ్య తరచుగా దగ్గు వస్తోంది. ఆ రోజు విపరీతంగా వచ్చింది. ఇన్నాళ్ళూ డాక్టరు దగ్గరకు వెళ్ళాలనుకుంటూనే గడిపేస్తోంది. చివరకు డాక్టరుగారే రావలసిన పరిస్థితి వచ్చింది. విపరీతంగా దగ్గువచ్చి తను లేవలేకపోయింది. శ్రీనివాసరావుగారే డాక్టరును తీసుకువచ్చారు. ఆమెను పరీక్షచేసి ఇది టి. బి. దీనికోసం ఈ రోజుల్లో వర్రీ అవక్కర్లేదు. కాని ఈమెకు బాగా ముదిరిపోయింది. సరియైన మందు, పుష్టికరమైన ఆహారము తీసుకోవాలి. ముఖ్యంగా మనస్సుకి ప్రశాంతత ఉండాలి దేనిగురించీ ఆలోచించకూడదు. మనస్తాపం పనికిరాదు అని చెప్పి వెళ్ళారు.

* * *

ఏమిటి రమేష్ ఏదో మాట్లాడాలన్నావు. ఇలా కూర్చున్నావేమిటి? ప్రశ్నించేడు మూర్తి. ఆ సాయంత్రం కె. జి. ఆసుపత్రిలో దూరపు బంధువులెవరో అడ్మిట్ అయ్యారని చూడటానికి వచ్చిన మూర్తిని రమేష్ కలిసేడు. నీతో మాట్లాడాలిరా అంటూ బీచ్‌కి తీసుకువచ్చాడు.

మూర్తి ప్రశ్నకు తేరుకుని అదే ఎలా మాట్లాడాలో తెలియటంలేదు అన్నాడు రమేష్.

ఇందిరవద్దనుంచి ఉత్తరాలేమైనా వస్తున్నాయా? మూర్తే అడిగేడు. ఆఁ నేను వ్రాయటంలేదు తిరిగి గోల పెడుతూ వ్రాసింది. నేనక్కడకు వెళ్ళినప్పుడు మీరు వేరే ఉంటే వస్తాను లేకపోతే రాను అని చాలా నిర్లక్ష్యంగా చెప్పింది. ఇక్కడ మాతో కలసి ఉండటం తన కిష్టంలేనప్పుడు నేను ఏం వ్రాస్తాను? అప్పుడూ ఇప్పుడూ కూడ ఒకేమాట మీదున్నాను. నా వాళ్లను వదలి వేరే ఉండను.''

''రమేష్! ఒకటి చెపుతాను ఏమీ అనుకోకు. ఇది నీ భార్య విషయం. మధ్యలో నాలాంటివాళ్ళు రాకూడదు. కాని చూస్తూ ఊరుకోలేకపోతున్నాను, సంసారానికి భార్యాభర్త లిరువురు బండిచక్రాల్లాంటివారు. ఒకళ్ళ నొకళ్ళు అర్థంచేసుకుంటే ఏ కలతలు రావు. ఇద్దరూ సమానంగా నడపాలి బండిని. అందులో ఏ ఒకటిపోయినా బండి నడవదు.

నీకు పెళ్ళయి ఆరేళ్లయింది. రెండేళ్ళ బాబు కూడ ఉన్నాడు. నీ వెప్పుడైనా బాబుని ముద్దు పెట్టుకున్నావా? ఒక్కసారి ఎత్తుకుని హృదయానికి హత్తుకున్నావా? ఎలా ఉండగలుగుతున్నావు నీ రక్తాన్ని దూరం చేసుకుని? పసివాడికి తండ్రి ప్రేమ ఎలాఉంటుందో తెలుసా? భగవంతుడు కొందరికి తల్లిదండ్రుల్నివ్వడు. కొందరికి ఇచ్చినా వాళ్ళ ప్రేమను కరువు చేస్తాడు. బాబు పుట్టకముందు నాలుగు సంవత్సరాలు ఒంటరిగా ఉన్నారు. సరిగ్గా ఒక్క వారంరోజులైనా నీ భార్యతో సుఖమనుభవించేవా? ఏమిటి కారణం? ఎక్కడుంది లోపం?

నాకూ నీలాగే పెళ్ళయి ఆరేళ్లయింది. ఇద్దరు పిల్లలున్నారు. నీకన్న కొంచెం చిన్నవాడినేనేమో! నేను గడిపిన జీవితంలో నాల్గవ వంతైనా నీ వనుభవించి ఉండవు. నీకే కాదు నాకూ ఉన్నారు తల్లితండ్రులు. నీ అతి నెమ్మదే నీ సంసారాన్ని బలి తీసుకుంది. అనవసరంగా ఆమెను బాధించక వెళ్ళి తీసుకురా. కాని తల్లిని భార్యని వుంచవలసిన హద్దుల్లో వుంచు. ఇంట్లో ఏ కలతలు






... అడవాళ్ళని అదు పులో పెట్టుకోని. చాతకానితనమే కనపడుతుంది. పరాయి అమ్మ కన్న పిల్ల ఆమెను ఏమీ అననివ్వకు. నీ తల్లి నోటికి తాళం బిగించు. అంతగా మానకపోతే వేరే వుండి ఆమెను సుఖపెట్టు. మీ నాన్నగారిచ్చే ఆస్తిపాస్తులేం రావని బెంగపెట్టుకోకు. మీ ఇద్దరి సంపాదనమీద బ్రతకలేకపోరు'' అన్నాడు.

*   *   *

రమేష్ ఇంటికి వచ్చేసరికి ఇల్లే పెద్ద రణరంగంలా వుంది. తోటలో పనిచేసే లక్ష్మి కుటుంబం పెరటి వైపున వుంటోంది. దాని కూతురు మొగుడ్ని వదిలేసి ఇక్కడికి వచ్చేసింది లక్ష్మి అల్లుడికి కబురు పెట్టింది ఒకసారి రమ్మని. ఇప్పుడు వచ్చేడు. వాళ్ళందరకి వాగ్వాదం జరుగుతోంది.

''సిగ్గు లేకపోతే సరి ఏ ముఖం పెట్టుకుని వచ్చావుగె ఏం చేయాలి నే నక్కడికి వచ్చి?'' అంటోంది లక్ష్మి కూతుకు.

''అదేమిటే అట్లాగంటావు. నీ యింటికి నువస్తున్నావు అంతే. కాని ఏం చెయ్యాలి అనడగడమేంటి?'' అంటున్నాడు వాడు.

"అదే మావా నే చెప్పేది. నీకు నా అవసరమేమైనా వుందా? లేనప్పుడు నేనక్కడుండట మేమిటి. మా అమ్మ నాకు పెళ్లి చేసింది నీతో సుఖపడాలని. కాని మీ అమ్మచేత తిట్లు తినమని కాదు. నువ్వు మనిషివైతే నీకు ఒక ఆడది అవుసరము వుంటాది. నువ్వు మరబొమ్మవు. మీ అమ్మే అన్నం పెట్టేస్తది నీవెళ్లి పొలాల్లో కూర్చుంటావు. ఎప్పుడైన పువ్వులుతెచ్చి పెట్టుకోవే అన్నావా? ఓ చీర కొని ఇదుగోనే అని ఇచ్చావా? నీకునేనెందుకు? కాబట్టే ఎల్లెళ్ళు. మా అమ్మకు బుద్దినేక నీకు కబురెట్టింది.'' అని ఎన్ని అంటున్నా వాడేమీ మాట్లాడక అలాగే ఉన్నాడు.

"అయితే ఏం చేత్తానంటావే నన్ను మళ్లీ మనువాడైమంటావా?'' అన్నాడు.

''ఆ ఆ నీ మొఖానికి అది కావలసొచ్చింది. ఉన్న దాన్నినన్నేమో గాలికి వదిలేశావు. మళ్లీ ఇంకొకత్తిని తగులుకుంటావా? దానికైనా కావలసిన అవసరమేంటో చూడు. అన్నీ అమ్మే ఉందని వదిలెయ్యకు'' అంది వీలయినంత ఎత్తిపొడుపుగా.

''అదేమిటే వాడు తీసికెడతానంటుంటే వాణ్ని మళ్లీ పెళ్లి చేసుకోమంటావు. నీవు రాకపోతే పెళ్లాడుతానంటున్నాడు కాని నిన్నేమి అనటంలేదుగా'' అంది లక్ష్మి కలుగచేసుకుని.

''అమ్మా! నేవాడితో వెళ్లను. నా కిష్టమైన వాణ్ని మళ్లీ మనువాడతాను.'' అంది ఎగిరిపడుతూ.

అదిరిపోయాడు రమేష్, ఎంత ధైర్యంగా చెపుతోంది. ఔను ఏం చేస్తుంది? తినేది ఉప్పు కారము. వాడు మానులా ఉంటే దీని కోరికలు చంపుకుంటుందా! అది వాళ్లల్లో తప్పు కూడకాదు. ఒక్కసారిగా ఇందిర మీదకు పోయింది దృష్టి.

ఆమెను ఏమాత్రం సుఖపెడుతున్నాడు. ఆమెకూడ ఇలాగే అంటె! అబ్బ ఈ ఊహకే చాలా నీరసంగా ఉంది. నిజంగా అల్లాంటి

వనే చేస్తే తను బ్రతకగలడా? పాపం ఆమె ఎంత బాధపడిందో అమ్మ సూటీపోటీ మాటలకు కాని నేనొక్కసారి ప్రేమగా మాట్లాడలేదు. ఎన్ని ఉత్తరాలు వ్రాసింది. ఒక్క ఉత్తరానికికూడ జవాబు వ్రాయలేదు. తనెంత మూర్ఖుడు సాయంత్రం మూర్తి మాటలు, ఇప్పుడీ సంఘటనలవల్ల అతనిలో చైతన్యం వచ్చినట్లుంది.

* * *

బాబు వచ్చీరాని మాటలు చాలాముద్దుగా వున్నాయి. వాకిట్లో వాడికి అన్నం తినిపిస్తూంది ఇందిర. 'నువ్వు దోబూచి అను అప్పుడు వస్తామ' అంటున్నాడు పూల మొక్కల దగ్గరకు వెళ్ళిపోతూ. అలాగే వాడిని ఆడించి అన్నం తినిపించి చేతులు కడుక్కొని హాల్లోకొచ్చి కూర్చుంది.

"అక్కా నిన్న మూర్తిగారు కనిపించేరు. మీ అక్క దగ్గరనుండి ఉత్తరాలు వస్తున్నాయా అనడిగేరు. నీవు ఇక్కడున్నట్లు తెలియదేమో!" అన్నాడు రవి.

'ఏమో' అంది పెదవి విరిచి.

"నేను చెప్పేను అక్క రిజైన్ చేసేసిందండి ఒంట్లో బాగుండలేదు. ఇక్కడే వుంది" అన్నాను..

"అయితే మూర్తిగారికి తెలిసిందంటే బావకి తెలుస్తుంది. ఒక్కసారి వస్తే బాగుండును చూడాలని కళ్ళు కాయలుకాచి పోతున్నాయి" అంది.

"పోనీ ఒక్కసారి వెళ్ళి చూసి వచ్చెయి" అన్నాడు రవి.

"లాభంలేదు నేను వెడితే ఆమె ఏమైనా అనొచ్చు, తట్టుకొనే ఓపిక నాలో లేదు" అంది.

లోపలనుండి తల్లి పిలవడంతో రవి లోపలకు వెళ్ళిపోయాడు.

## రాలిన ముత్యాలు

......శ్రీ సోమసుందర్......

శ్రావణ సంధ్యా పులకిత
క్షితిజ రేఖ ముఖశోభకు
కాంతారాంతరాల నింపి
మయూరాలు నర్తించును !

## వ్యక్తిత్వంలేని వ్యక్తి

"హాల్లో అడుగుపెడుతున్న పరంధామయ్యను చూసి గతుక్కుమంది పెద్దపులిని చూసినట్లుగా.

"భయపడకమ్మా! నే నిదివరకువాడను కాను. కూలగొట్టిన నీ కాపురాన్ని చక్క దిద్దాలనే వచ్చాను."

"ఇంతకీ మీ రొచ్చిన పనేమిటో శలవియ్యండి" తీక్షణంగా ఉందా స్వరం.

"బాబుని, నిన్ను తీసుకెళ్ళటకు వచ్చాను. అక్క, బావ గోలపెట్టేస్తున్నారు బాబుని చూడాలని."

"నేను రాను వెళ్ళండిక. పిల్లవాడిమీద ఏడాదికి మనసు పుట్టినట్లుంది."

"ఇదిగో రమేష్ నీకివ్వమన్నాడు" అంటూ జేబులోంచి కాగితం తీసిచ్చేడు. అది అందుకుని చదవనారంభించింది.

బాబు ఆడుకుంటున్నట్లు తలుస్తాను. నీ ఆరోగ్యం ఎలా ఉంది మరొక్కసారి ఆలోచించుకో. ఎంత వద్దన్నా ప్రాకులాడుతున్నానని అనుకోకు ఆడదానివి. అబలవు నీవొక్కదానివి బ్రతకలేవు. నీకు తల్లితండ్రులు శాశ్వతంగాదు. భర్తఅనేవాడి అండ ఉండాలి. ఎంత నరకమైనా అత్తింటో నే ఆడుదానికి స్థానం.

ఏనభై ఏళ్ళువచ్చి కాటికి కాళ్ళు చాచుకున్నా నా తల్లితండ్రులను వేరే ఉంచితే లోకం ఊరుకోదు. ఇంక వాళ్ళు బ్రతికినంతకాలం బ్రతకరు చదువుకున్నవాళ్ళం మనం సంసారాన్ని స్వర్గధామం చేసుకోవాలి కాని తొందర పడకూడదు. కాబట్టి నీ నిర్ణయం తెలియజెయ్యి. నీవు రానిచో బాబుని పంపించు.

ఇట్లు
రమేష్

లక్ష్మి కూతురి తగాదాలో ఇందిరమీద కలిగిన సానుభూతి తల్లి మాటలతో తుడుచుకుపోయింది. ఎంత సౌమ్యంగా వ్రాద్దామనుకున్నా వ్రాయలేకపోయాడు.

ఉత్తరం మడిచి బాబు బట్టలు బాగ్‌లో పెట్టి 'తీసికెళ్లండి బాబును' అని పంపించింది.

"అక్కా భోజనానికిరా" అంటూ వచ్చిన రవి కంగారుపడి తల్లిని పిలిచేడు. అప్ప పూర్ణమ్మగారు, పద్మ వచ్చి ఇందిరను చూసి ఫెయింటయ్యిందని తెలుసుకున్నారు. ముఖం మీద నీళ్ళుచల్లి గ్లూకోజ్ నీళ్ళు నోట్లో పోసేరు. నెమ్మదిగా కళ్ళు విప్పింది.

"ఎలా ఉందమ్మా !" ఆత్రతగా అడిగింది తల్లి.

రవీ బాబుని చూడు ఎక్కడున్నాడో అంది పద్మ. పరంధామయ్య రావడం వాళ్లెవరూ గమనించలేదు. హాల్లోనే పది నిముషాలు కూడ కూర్చోకుండా వెళ్ళిపోవటంవల్ల వాళ్ళకు తెలియలేదు.

"పరంధామయ్యగారు వచ్చేరు. బాబుని పంపమని వాళ్ళు కబురు చేసారు. ఆయనతో పంపించేసేను." అంది నీర్సంగా.

"ఎంతపని చేసావమ్మా" అన్నారు అప్పుడే వచ్చిన శ్రీనివాసరావుగారు. "ఏం నాన్నా వాళ్ల పిల్లాడు వాళ్లకు వారసుడు పంపించటం తప్పేమిటి? ఒకవేళ నేనేదైనా అయినా బాబు వాళ్లకు చెందవలసినవాడేగా! ఇక నా ఆరోగ్యం అంటారా మహా బ్రతికితే నెలో రెండునెల్లో. ఆపైన ఆశలేదు. మీరంతా దాచినా నా పరిస్థితి నాకు తెలుసు" అంటూ క్రమాంతం దగ్గువచ్చి ఆయాసపడుతూ పడుకుండిపోయింది ఇందిర.

(ఇంకా వుంది)



# ధర్మపథం

## దయ - మాయ

మానవుడై పుట్టినందుకు సర్వ భూతములయందును దయ కలిగి ఉండడం ధర్మం అది లేకపోతే మానవత్వం లేనట్లే భావించవలసి ఉంటుంది ఎంత కఠిన హృదయుడికయినా హృదయకోశంలో ఏదో ఒక మూల కొంచెమైనా దయ ఉంటుంది.

ప్రేమ అనేది ఉన్నప్పుడే దయ కలుగుతుంది. అది లేకపోతే దయకు స్థానమే లేదు ఈ విధంగా ప్రేమ ఉన్నా- అందరిమీదా సమానమైన ప్రేమ ఉండడం సాధ్యం కాదు. ఇతరులపై ఉండే ప్రేమ కంటే ఆప్త బంధువులపై ఉండే ప్రేమ ఎంతో అధికం. అందులోను తారతమ్యం ఉన్నది. ఇతర బంధువర్గంమీద ఉండే ప్రేమకంటె తన దారా సుతాదులపైని ఉండే ప్రేమ ఎంతో ఎక్కువ ఆ ప్రేమ దయతో కూడి ఉండేదే ఈ వ్యత్యాసాన్నిబట్టే ఇతరులపై ఉండే ప్రేమను దయ అనీ, ఆప్తులపయి ఉండే దాన్ని మాయ అని చెప్పడం జరుగుతున్నది.

అత్యధికమైన ప్రేమ, అత్యధికమైన ఆశ ఉన్నప్పుడు మాయ మానవుణ్ణి ఎక్కువగా అలముకుంటుంది. అట్టివాని ఆలోచనలు "ఆలూ లేదు, చూలూ లేదు, కొడుకుపేరు సోమలింగం" అనే సామెతకు దృష్టాంతంగా ఉంటాయి.

సాధారణంగా మానవులు తమ బిడ్డల అభివృద్ధి కోసం ఎంతో పాటుపడతారు తమ అవసరాలు తగ్గించుకుని వాళ్ల సౌకర్యాలకోసం సర్వవిధాలా ప్రయత్నిస్తారు స్కూళ్లలోనూ, కాలేజీలలోనూ సీట్లు దొరక్కపోతే వాటి అధికారుల కడుపులూ, కాళ్లూ పట్టుకునైనా పిల్లవాళ్లను వాటిలో ప్రవేశపెట్టి విద్యాబుద్ధులు కలిగేటట్లు చేస్తారు, తమ పిల్లలు పెద్ద ఉద్యోగాలు చేసి ధనం సంపాదించి, తమరిని ముసలికాలంలో పోషిస్తారనే ఆశ ఒకటి వెనుక ఉండబట్టే యిలా కష్టపడడం! ఆ వయస్సులో వాళ్లు గమనించరేమో అనే సందేహమన్నా వుండదు. ఇదంతా మాయ కాక మరేమిటి? అని పరమహంస ప్రశ్నిస్తారు.

ఇట్టి మాయకు లొంగకుండా వుండాలి. అందరినీ సమానంగా ప్రేమించడం అవసరం. అయితే దయ కూడా ఒక బంధమేనా? అంటే బంధమే అని చెప్పాలి. త్రిగుణాలకూ అతీతులయి అత్యున్నత స్థితిని పొందినవారికి దయ ఒక బంధంగానే తోస్తుంది. కాని, సామాన్యులకు దయాగుణం వుండవలసినదే! సామాన్యులకు సత్వ గుణం అవసరం. దయ సత్వ గుణ లక్షణం. సర్వభూతాలనూ సమానంగా చూడడం దయ వుంటేనేగాని సాధ్యం కాదు. అది మాయగా మాత్రం పరిణమించకూడదు.

— బులుసు వేంకట రమణయ్య

---

## వారఫలం

19–11–1976 శుక్రవారం మొదలు
25–11–1976 గురువారం వరకు

**మేషం:** మీ ఆలోచనలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వారంమధ్యలో ప్రయాసకు గురి కాగలరు. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధువులకు చికాకులు యేర్పడతాయి.

**వృషభం:** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి. రావలసిన డబ్బు అందుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు:—ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

**మిథునం:** వృత్తిలో ఆదాయం పెరుగుతుంది సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయవ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. అనవసరసందేహాలు కలుగుతాయి. వారం ఆఖరులో మీ ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. స్త్రీలకు:—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం:**— ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. మీ కార్యక్రమాలు హడావుడిగా వుంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వ్యాపారములో నూతనావకాశాలు లభిస్తాయి. ఇతరుల నిమిత్తం శ్రమపొందవలసి వస్తుంది. స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**సింహం** — వ్యాపారంలో పోటీవారి పోటీ తగ్గుతుంది. మిత్రులకు సహాయం చేస్తారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. స్త్రీలకు:— పుణ్యకార్యాలు చేస్తారు. వినోదకలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య:**— మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. రావలసిన డబ్బు అందుతుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వారంఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**తుల:**— వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు లాభించగలవు. స్త్రీలకు:— కుటుంబవ్యవహారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**వృశ్చికం:**— సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వృత్తిలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో అనుకూలత లభిస్తుంది వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ముఖ్యమైన ఉపయోగించ గల సంభాషణలను జరుపగలరు. స్త్రీలకు:— ఆరోగ్యం బాగుండదు వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు:**— మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో వ్యతిరేకమైన వార్తలను వింటారు. ప్రయాణాల్లో శ్రమకలుగుతుంది. వారం ఆఖరులో వృత్తివ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మకరం:** వృత్తిలో ముఖ్యమైనవ్యక్తులను కలుసుకొంటారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారంఆఖరులో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**కుంభం:**— రావలసిన డబ్బు అందుతుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు:— సంతోషకరమైన వార్తలను వింటారు. పోటీవారిలో గౌరవం బాగుంటుంది.

**మీనం:**— వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ఆందోళన కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు:ఆరోగ్యం బాగుండదు. బంధువులకు సహాయం చేస్తారు

మహేష్

# కైవాలి

## కె. రామలక్ష్మి

**జగదీష్. కర్నూలు**

మీ ఆడవాళ్లంతా మంచిగా (గయ్యాళితనం మాని) మారేదెప్పుడండీ?

సుదూర భవిష్యత్తులో! ఏం గయ్యాళితనానికి మంచితనానికీ చుక్కెదురా? కాదే. మీకు తెలుసో తెలియదో— మన సూరేకారం (సారీ) సూర్యకాంతం మంచితనం మూర్తీభవించిన గయ్యాళి!

**ఎస్. ఎస్. ఆర్. నెల్లూరు**

కె. రా. గారూ, దేశంలో జరుగుతున్నస్మగ్లింగు, దొంగరవాణా దొంగ నోట్ల ముద్రణ పూర్తిగా అరికట్టాలంటే మళ్లీ బ్రిటిష్ పరిపాలన రావాలి.

అక్కరలేదు. చరిత్ర ముందుకు సాగుతుందే గాని తిరోగమించదు. వెనక్కి నడవదు. నేడు రాజకీయ మేధావి, కీలెరిగిన వాత వేసి రోగనయం చేసి దేశాన్ని ఒక్క తాటికి తెచ్చి— క్రమశిక్షణ, దేశం పట్ల భక్తి బాధ్యతలు చూపెట్టవలసిన బాధ్యత తెలియచెప్తూంది మన— నేత.

**జి. ఎమ్. ఎస్. పెనుమండ్ర**

నీకు దేవుడన్నాదెయ్యమన్నా నమ్మకమువున్నదా?

ఉంది. దెయ్యాలు పీక్కు తినడం వల్ల. దేవుడు కనపడక పోవడం వల్ల.

**ఎస్. డి. ఎన్. నంద్యాల**

కె. రా. గారూ మహిళా సంవత్సరంగా రాక్షస నామ సంవత్సరంలోనే ఎందుకు నిర్ణయించారు?

మనకీ సంవత్సరాల పేర్లు గాని ప్రపంచానికి కాదు కనుక. అయినా— ఇదే ప్రశ్న వో ప్రముఖ రచయిత్రి చూడ వెళ్లినవో పెద్దమనిషిని అడిగిందట 'ఇది కూడ తెలియని రచయిత్రులు అభ్యుదయం గురించి మాట్లాడ్డం హాస్యాస్పదంగా లేదా' అంటున్నారాయన.

**జి, పి. ఆర్. ఆర్. మంచిరి**

భూమి పెద్దదా? సముద్రం పెద్దదా?

భూభాగానికి మూడు రెట్లు ఎక్కువ సముద్ర బాగం అంటున్నారు. ఇదిగో బయలుదేరుతున్నా— కొలిచి తేల్చి పారేద్దాం. ఎందుకొచ్చిన అనుమానం?

**టి. ఎస్. ఎన్. కరీంనగరు**

ఆడపిల్లల తల్లితండ్రులు తమ పిల్ల అందంగా లేకపోయినా కట్నం ఎరగా పెట్టి పెళ్లిళ్ళుచేసే వారు.

ఆ రోజులు పోయాయి. అయినా కట్నం అనే పుల్లిపాయి పకోడీల కోసం ఎలకల్లాగా బోనులో పడ్డం— సిగ్గుచేటు కద. ఎర చూసి స్నేహాన్ని అమ్ముకోవడం— పౌరుషం లేక పోడానికే కదు— పిరికితనానికి కూడా లక్షణం.

**కె. టి. వి. వి. రామచంద్రాపురం**

మీ ప్రశ్నావళి శీర్షిక పత్రికకు చంద్రునిలో మచ్చ లాగా వుంది. చూస్తూ చూస్తూ చందాదారుగా చేరడానికి మనస్కరించడం లేదు.

మీ బేలతనం చూస్తుంటే జాలిగా వుంది. చంద్రునిలో మచ్చ వుందని వెన్నెల పడకుండ బురఖా వేసుకుంటారా?

**రవి: హైదరాబాదు**

ఆడదాని మాట వినే మగవాడు ఏదీ సాధించలేడంటాను.

ఇప్పుడీ దేశం సాధిస్తున్న ప్రగతికి నాంది— ఆడదాని మాట కాదా.

**ఎమ్. బిహెచ్. సిరిపిల్ల**

ఆరుద్రగారి సినీకవిత్వం చదివినప్పుడు మీ అనుభూతి ఎలా వుంటుంది?

ఎలా చెప్పడం? మీకు అవి పాటలు. నాకు ఏకవుంట్లు (అయినా మనలో మనమాట. నాకు పాటగా 'ముత్యమంతా పసుపు'' ఎంత ఇష్టమో ఒక భావనగా అది నాకు చుక్కెదురు అటువంటి స్త్రీని నేను ఒక్క క్షణం కూడా సహించలేనేమో)

సమాజంలో స్త్రీ స్థానం మారేది ఎలా? ఎప్పుడు?

ఇంకా ఏ జోస్యుల వారూ ముహూర్తం నిర్ణ నిర్ణయించలేదని ఎక్కడేసిన గొంగళి అక్కడే అన్నట్టు పడివుంటుందనుకుంటున్నారా మీరు. . చైతన్యవంతమైన వాతావరణంలో మీలాంటి వాళ్లు గుర్తించ లేనంతగా మారిపోతుంది స్త్రీ.

**ఏ. బి. నడిపూడి**

మగ వాళ్లలో కంటే ఆడవాళ్ళు రచయిత్రులుగా వృద్ధి పొందడానికి గల కారణం?

ఏముంది— 'తెరిపి 'పని పాటా లేక పూరికె కూర్చుని తెగరాసేస్తుంటారీ ఆడవాళ్ళు' అనిఅంతా అనుకోడం వినలేదా చిట్టిబాబూ

**జి. ఎస్. ఎల్. జగ్గంపేట**

నేటి చిత్రాల కంటే పాత చిత్రాళే బాగున్నాయి.

అంతే మరి. రోగికి పచ్చపూరగాయ రుచిగా వుండదా మరి!

**పి. ఎమ్. నిజామాబాద్**

అసలు దేవుడెక్కడ వున్నాడు?

అదే కద నిరంతర అన్వేషణ.

అందరికీ ఎందుకు కనిపించడు?

బాగుంది, నేను దేవుణ్ని. నమస్కరించండంటూ ఏ దేవుడయ్యా చెప్పేది ఒక్క సినిమా దేవుళ్ళయితే ఏమో గాని.

ఆయనకి పూజలు చేయక పోతే కష్టాలపాలు చేస్తాడు?

ఎవరు చెప్పారు? పూజలు చేసే వారికష్టాల మాట మరచి పోతున్నారు. ఈ లోకంలో కష్టాలన్నీ ఎవరికి వారు సృష్టించు కొన్నవి, చుట్టూ వున్నవాళ్ళు సృష్టించినవేగాని దేవుడికీ వీటికీ బాధ్యత లేదు.





చొక్కాపు వెంకటరమణ

సుబ్బారావు అతికష్టంగా కళ్ళు తెరిచాడు!

కళ్లల్లో కారం చల్లినట్లూ – సూదులతో పొడుస్తున్నట్లూ – ఒకటే మంట! ఒకటే పోటు! ప్రళయం తర్వాత ఏర్పడిన ప్రశాంతతలాగ అంతటా నిశ్శబ్దం! తనను కబళించడానికి వచ్చిన మృత్యువు మూలుగులా – గిరగిరా శబ్దంచేస్తూ, పైన ఏదో వల్లటి నీడ తిరుగుతోంది.

అస్పష్టంగా మాటలు!!

తనెక్కడున్నదీ ఊహించడానికి ప్రయత్నించాడు సుబ్బారావు.

ఊహూఁ...లాభంలేదు. తన ఊహకందటం లేదు. హాయిగా నిట్టూర్పు విడిచి ఎవరో అంటున్నారు.

"స్పృహ వచ్చింది... ఇక ఫరవాలేదు"

టకటక వెళ్ళిపోతున్న బూట్ల చప్పుడు!

బరువుగావున్న కనురెప్పల్ని బలవంతంగా పైకెత్తి చూశాడు. ఎదురుగా తెల్లని గోడ! చూపులు కిందికి వాలేయి. మల్లెపువ్వులాంటి తెల్లని ప్రక్కమీద కూర్చున్న ఓ యువకుడు తదేకంగా తనవైపే చూస్తున్నాడు.

ఆ చూపుల్లో ఆత్రుత వుంది, ఆ ముఖంలో గాంభీర్యం వుంది. ఏరగా, సన్నగా వున్నాడతను. వంకీలజుట్టు అతనికింకా అందాన్నిచ్చింది, అతనికి పాతికేళ్ళుండొచ్చు– ఇరవై ఏళ్ళ వాడిలా లేతగా కనిపిస్తున్నాడు, ఆత్రుతగా యింకా తనవైపే చూస్తున్నాడతను, ఔను... తనకేమైంది? తనెక్కడున్నాడు??

తల కొద్దిగా ప్రక్కకి త్రిప్పటానికి ప్రయత్నించాడు.

"ఉష్...ష్...ష్"

తల త్రిప్పకుండా పట్టుకున్నారెవరో!

మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు.

తనెక్కడున్నదీ ఊహించటానికి–

తను కళ్ళు తెరవటానికి ముందు జరిగిన విషయాలు గుర్తు తెచ్చుకునేందుకు ప్రయత్నించాడు సుబ్బారావు.

... ... ...

ఏవో అస్పష్ట ఆకారాలు–వాటి నీడలు... మందమారుతం లాంటి చిరునవ్వులూ – వెంటనే వికృత స్వరాలు... పెళ్ళి బాజాలు!! ఒకదాని వెంట మరొకటి తెరలు తెరలుగా కదులాడ సాగాయి అందమైన సీత రూపం కళ్లముందు సాక్షాత్కరించింది!

* * *

తన సీత! తన సర్వస్వం తన ప్రాణం– తన జీవితం–అనుకున్న సీత!! నవ్వుతూ – ముత్యాలు వొలకబోస్తూ – సూరిబాబుతో మాట్లాడుతోంది. వాడు ఆరోగ్–ఆ వెధవ– వేసిన 'విట్టు'కి విరగబడి నవ్వుతోంది! సీత –సూరిబాబు! చేతులు పుచ్చుకుని హుషారుగా నడుస్తున్నారు. సుబ్బారావుకి, గుండెల్ని ఎవరో బలంగా పిండుతున్నట్లనిపించింది.

కళ్ళు మూసుకున్నా ఆ దృశ్యాల్ని చూడగలుగుతున్న తన కనుగ్రుడ్లు పేలిపోవాలనిపించింది.

గుండెల్లో బద్దలయిన అగ్నిపర్వాతాల్లోని 'లావా' కన్నీరుగా మారి, బైటికొచ్చింది.

* * *

ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు సుబ్బారావు. పైనున్న నీడ గిరగిరా తిరుగుతోంది తన మీద మరో నీడ వాలింది. ఏమిటది? ఏమిటది?? కళ్ళు పైకెత్తాడు.

ముఖాన నవ్వు అతికించుకుని, నోట్లో ధర్మామీటర్ పెట్టిందామె.

అందంగానే వుంది. చీరలో అయితే

## మెడిమిక్స్

15 రకముల ఆయుర్వేద వనమూలి కలచే తయారుచేయబడిన మెడిమిక్సు సబ్బువలన చిన్నపిల్లల చర్మరోగములైన తామర, గజ్జి, చాకలిపొడలు, మంగలి పొడలు, చెమటకాయలు లేకుండ జేయును. ముఖముమీద మొటిమలు తొలగించును. నల్లటి మచ్చలు తీసివేయును.

## మెడిమిక్స్

ఆధునికముగా లభించు సౌందర్య సాధనములకంటె మెడిమిక్సు సబ్బులో వున్న వెలకట్టలేని వనమూలికల వలన ముఖమునకు సౌందర్యమును కలుగ జేసి చర్మమును ఆరోగ్యవంతముచేసి చర్మమునకు సొగసును, మెరుపును కలుగజేయును.

## మెడిమిక్స్

స్వచ్ఛమైన కొబ్బరినూనె వలన మెడిమిక్సు సబ్బు తయారగుచున్నది. కావున ఉప్పునీటిలో కూడా సమృద్ధిగా తెల్లటి నురగనిచ్చును.

## మెడిమిక్స్

మెడిమిక్సు సబ్బునందు చందనపు నూనె, వట్టివేరు నూనె మరియు వెల గలిగిన ఆయుర్వేద వనమూలికల వలన దినమంతయు చల్లదనము ఆహ్లాదమును కలుగజేయును.

## మెడిమిక్స్

ఇండియా పరిమళ ద్రవ్యములలో ఎన్నికైన తాయంపు సువాసన ద్రవ్యం మెడిమిక్సు సబ్బు కలిగినందున దానివలన వచ్చు సువాసనలు రోజంతా మిమ్ములను పరవశింపజేయును.

# రక్షణ ! సువాసన!! ఎక్కువ నురుగు!!!






చర్మ వ్యాధులకు డాక్టర్లచే సిఫారసు చేయబడినది

# మెడిమిక్స్

## ఆయుర్వేద టాయిలెట్ సబ్బు

CHOLAYIL PHARMACEUTICALS

SUBHODAYA

# కిటికీ కామాక్షి

యింకా అందంగా వుంటుంది.

ఇప్పుడు మాత్రం తెల్లగౌనులో —

'సిస్టర్ !'

"కాదు... కాదు... నర్స్ !"

కనురెప్పలు బరువుగా మూసుకుపోతున్నాయి. కాళ్ళూ, చేతులు ఏదో బరువుతో కట్టేసినట్లున్నాయి. తలమీద ఏదో బరువు పెట్టినట్లు భారంగా — బాధగా వుంది.

"అతను కదులుతున్నట్లున్నాడు... తీసుకోమంటారా ?"

ఎవరో ఆత్రుతగా అడిగారు.

"ఉహూఁ... ఇప్పుడు వీలుకాదు... రెండు రోజులు పోతే పేషెంట్ స్టేట్‌మెంటు యివ్వగలడు. ఐయామ్ సారీ !"

అన్నారెవరో. పోలీసులు - డాక్టర్లు - కావచ్చు. తనున్నది హాస్పిటల్ !!!

అతి ప్రయత్నంమీద మళ్ళీ కళ్ళు తెరిచాడు సుబ్బారావు.

నర్స్ లేదు.

అందమైన నర్స్ వెళ్ళిపోయింది !

ఈ నర్స్‌కంటే తన 'సీత' వెయ్యిరెట్లు అందంగా వుంటుంది !

కానీ... కానీ... కానీ... భారంగా మూలిగాడు సుబ్బారావు. ఏదో నీడ కదిలింది. సుబ్బారావు కళ్లు చిట్లించి చూశాడు. అతను తనవైపు వస్తున్నాడు. ఎదుటి బెడ్ మీద వున్న వంకిలజుట్టతను.

సన్నగా, ఎర్రగా వున్న ఆ యువకుడు దగ్గరగావచ్చి సుబ్బారావు బెడ్‌మీద ప్రక్కనే కూర్చున్నాడు.

ఎంతో స్నేహభావంతో — ఆప్యాయంగా చూస్తున్నాడు

"బాధగా వుందా ?" అడిగాడు

జవాబు చెప్దామంటే గొంతు పెగలటం లేదు.

చేత్తో సైగ చేయాలి.

'కలుక్కు' మంది చెయ్యి.

కాళ్లూ, చేతులూ ఫ్రాక్చర్స్ అయి బరువైన బాండేజీలతో కట్టబడి వున్నాయి. సుబ్బారావు స్వాధీనంలో వున్నది ఒక్క తల మాత్రమే.

అది కూడా పూర్తిగా ప్రక్కలకే తిప్పలేక పోతున్నాడు.

"లేదు" అన్నట్లు తల అడ్డంగా ఊపాడు సుబ్బారావు.

సుబ్బారావు కంటి కొసల నుండి జారుతున్న నీటి బిందువుల్ని చేత్తో తుడిచాడు అతను.

"బాధపడకండి ! మిమ్మల్ని నిర్దాక్షిణ్యంగా గుద్దేసిన ఆ టాక్సీ డ్రైవర్ని పోలీసులు అరెస్టు చేశారు... ఇప్పుడు వాడు కటకటాలు లెక్కపెడ్తూ వుంటాడు" అతనే అన్నాడు.

టాక్సీ డ్రైవర్ మూలంగా తనీ బెడ్‌మీద — కాదు - తన మూలంగా టాక్సీడ్రైవర్ కటకటాల వెనుక ! పాపం ! అతని తప్పేంలేదు. తను లారీ నుండి తప్పుకోబోయి టాక్సీ క్రిందకి వచ్చాడు. టాక్సీ... టాక్సీ.

సీత, సూరిబాబు యిప్పుడు 'టాక్సీ'లో ఊరంతా తిరిగి ఊరేగుతుంటారు.

టాక్సీ ఏం ఖర్మం—ఆ వెధవకి చిన్నకారుందిగా—

అదీ అందమైనదే—వాడూ ఓ మోస్తరు అందగాడే

సీత అంతకంటే అందమైంది !

పూర్ ఫెలో తనే... తనే ...

ఆ లారీ కిందనుండి తప్పుకోకపోయున్నా బావుండిపోయేది.

ఆ లారీ టైర్ల కిందపడి కప్పలా నలిగిపోయున్నా తనకీ దిగుళ్లు వుండేవి కావు ...

ఆ సీత, సూరిబాబు ఎలా ఊరేగినా తనకేం బాధ వుండేది కాదు.

తను చావకపోగా టాక్సీ డ్రైవర్ని చిక్కుల్లో పెట్టాడు

"నా పేరు చలపతి"

సుబ్బారావు ఉలిక్కిపడ్డాడు. ఆలోచన్లలోంచి బయటపడ్డాడు.

అతనే వంకిలజుట్టు యువకుడు.

అతని పేరు చలపతా ??

"ఈ రూమ్‌లో వున్నది మనిద్దరమే ... నేను మీ ఎదురుగా బెడ్ మీదే వుంటాను ... ఏదైనా అవసరం అయితే నన్ను పిలవండి"

చలపతి నవ్వుతూ తన బెడ్ మీదికి వెళ్ళిపోయాడు.

అతను నవ్వుతుంటే ఎంతో హాయిగా వుంది.

సీత నవ్వినా అంతే !

తన మనసులో మల్లెలు పరిచినట్లుంది.

(35 వ పేజీ చూడండి)

# హార్లిక్స్ ఆరోగ్యం.
# నాడూ, నేడూ, ఎల్లప్పుడు కూడా.
## అంటుంది సుచిత్ర

**హార్లిక్స్ ఆరోగ్యంతో మీ కుటుంబపు భవిష్యత్తు తీర్చి దిద్దుకోండి.**

ఆరోగ్యమే మహా భాగ్యం. విజయాలు, ఆనందం. ఆరోగ్యంగా వుంటే రోగాలు వుండవు. శ్రద్ధ పెరుగుతుంది.

అందువల్లనే సుచిత్ర, హార్లిక్స్‌ని తన కుటుంబపు జీవనంలో ఒక భాగంగా చేసుకుంది. హార్లిక్స్ కాల పరీక్షకి నిలబడుతుందని ఆమెకు తెలుసు

హార్లిక్స్.. ప్రపంచమంతటా డాక్టర్లు సిఫార్సు చేసేవి యిది ఒక్కటే. అంత ఎక్కువగా పుష్టి యిచ్చేది హార్లిక్స్ ఒక్కటే. ఎందుచేత నంటే, ఇందులోని బలవర్ధకమైన, కల్తీ లేని పదార్థాలని అపూర్వమైన హార్లిక్స్ తయారీ పద్ధతి ద్వారా సమ్మిళితం చేయబడ్డాయి.

సుచిత్ర మోస్తరుగానే మీరు కూడా మీ కుటుంబానికి ప్రతి రోజు హార్లిక్స్ యివ్వండి. ముందు ముందు వారు ఎంతో ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది.

**"మీరు హార్లిక్స్‌ని నమ్మవచ్చు.**
**నేను ఎల్లప్పుడు హార్లిక్స్‌నే సిఫార్సు చేస్తాను.**

అనారోగ్యంగా వున్నప్పుడు పుష్టిగా వుండటానికి హార్లిక్స్ పుచ్చుకోమని చెబుతాను. దీనికి కారణం చాలా స్పష్టమైందే. హార్లిక్స్ శుద్ధమైనది. కల్తీ వుండదు. మాంసకృత్తులు, కార్బోహైడ్రేట్లు, ఖనిజాలు యిందులో చక్కగా కలిసి వున్నాయి. ఇవన్నీ నిత్యం మంచి ఆరోగ్యంగా వుండటానికి సహకారం."





ఒక రూపాయి
ఆదా చేయండి.
800 గ్రాం ఎకానమీ
బాటిల్ కొనండి.




**దీనిలో ఆరోగ్యముంది.**

**హార్లిక్స్** మంచి పుష్టికరమైనది హార్లిక్స్ ఒక రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు.

Mx-4181 Tel.




*దుమ్ము లేపుకుంటూ వచ్చిన బస్సు ఒక్కసారి ఆగి జానకిరామయ్యగారిని దింపేసి మళ్లీ వేగంగా వెళ్లిపోయింది.*

చేతి సంచీతో బస్సు దిగిన జానకిరామయ్యగారు కళ్లజోడు సరిచేసుకుని ఒక్కసారి తలెత్తి నలువేపులా చూశారు. అది వూరు కాకపోయినా మరీ అంత పెద్ద పట్టణంకాదు. ఎటు చూచినా పెద్ద పెద్ద భవనాలేవీ లేకపోయినా, మామూలు డాబా యిళ్లు మాత్రం విసిరేసినట్టుగా అక్కడక్కడా అందమైన కట్టడంతో నిలబడి వున్నాయి.

ఆయన జేబు తడుముకుని జేబులోనుండి ఒక చిన్న కాగితాన్ని బయటకు తీసారు. మతడవిప్పి ఒకసారి చదువుకున్నారు. తిరిగి దాన్ని మడిచి జాగ్రత్తగా జేబులో పెట్టుకుని తలెత్తి అటూ యిటూ చూసి, కొంత దూరంలో వున్న రిక్షాను పిలిచారు. రిక్షావాడు క్షణంలో రిక్షా తీసుకుని వచ్చాడు.

"గాంధీపార్కు కెళ్ళాలి! ఏం తీసుకుంటావ్?" ప్రశ్నించారు జానకిరామయ్యగారు.

"రండి కూసోండి!" అన్నాడు రిక్షావాడు.

"అది సరేనయ్యా! ఏం తీసుకుంటావ్ ?" తిరిగి ప్రశ్నించారు.

"మీకు తోసింది యియ్యండి బాబుగోరూ!" అన్నాడు రిక్షావాడు.

"అలా అంటే యెలా ?" అన్నారు జానకిరామయ్యగారు.

"పోనీ ఓ అర్ధరూపాయిప్పించండి బాబుగోరూ !" అన్నాడు రిక్షావాడు.

"సరే! అలాగే పద!" అంటూ చేతిసంచీతో సహా రిక్షాలో కూర్చున్నారు జానకిరామయ్యగారు.

జానకిరామయ్యగారు జీవితంలో బడిపంతులు ఉద్యోగంచేసి అలసిపోయి, చివరకు విశ్రాంతి తీసుకుంటున్నారు. ఆయనకు యిద్దరు కొడుకులూ, యిద్దరు కూతుళ్ళూ. తన సంపాదన కొంత మెరుగ్గా వున్నప్పుడే పెద్దవాడు ఆనంద్‌ను డాక్టర్ చదివించారు. చిన్నవాడు రమేష్‌ను ఇంజనీరుగా తీర్చిదిద్దారు. పెద్దవాడు డాక్టర్ పానయి, ప్రాక్టీసు పెట్టగానే, వివాహంకూడా చేసేశారు. చిన్నవాడు మాత్రం యెవరో అమ్మాయిని ప్రేమించి పెళ్లి చేసుకున్నాడు. ప్రస్తుతం యిద్దరూ ఉద్యోగరీత్యా వేర్వేరు ఊళ్ళల్లో వుంటున్నారు.

ఇకపోతే ఆడపిల్లల్లో పెద్దమ్మాయి కరుణ ఇంటర్ తప్పడంతో యింటివద్దే వుంటోంది. చిన్నమ్మాయి అరుణ మాత్రం ఎస్సెస్సీ చదువుతోంది.

ఇటీవలే పెద్దమ్మాయి కరుణకు సంబంధాలు రాసాగాయి. జానకిరామయ్యగారుకూడా, కరుణకు యెక్కడయినా సంబంధం నిశ్చయమైతే వివాహం చేసేయాలనే నిర్ణయించుకున్నారు. అనుకున్నట్టు యీమధ్యనే ఓ సంబంధం ఖాయమైంది. కుర్రవాడు బి. యస్‌సి. చదువుకున్నాడు. బుద్ధిమంతుడు. హైద్రాబాదులోనే ఏదో రీసెర్చి లాబ్‌లో, రీసెర్చి ఫెలోగా ఉద్యోగం చేస్తున్నాడు. అయితే కుర్రవాడు ఉన్నతహోదాలో లేకపోయినా, అతి స్వల్ప వ్యవధిలోనే ఆ హోదాకు చేరే అవకాశం వున్నందున వాళ్ళు పెట్టుబడులు యెక్కువగానే అడిగారు. కాని జానకిరామయ్యగారికి వాళ్లడిగినంత పెట్టుబడులు, పెట్టడానికి సాధ్యపడలేదు. అయినా ఆయన ఆ సంబంధాన్ని వదులుకోదలచుకోలేదు.

రిక్షా ఆగింది గాంధీపార్కు దగ్గర. జానకిరామయ్యగారు చేతి సంచీతో రిక్షా దిగి జేబులో నుండి అర్ధరూపాయిబిళ్లను తీసి రిక్షావాడి చేతిలో పెట్టారు. రిక్షావాడు ముందుకు కదిలాడు.

జానకిరామయ్యగారు నాలుగడుగులు వేశారో లేదో యెదురుగానే బోర్డు కనిపించింది. కళ్లజోడు సరిచేసుకుని ఆ బోర్డువేపు పరిశీలనగా చూశారు. దానిపైన 'ఆనంద్ క్లినిక్' అన్న అక్షరాలు కనపడ్డాయి. ఆయన మనసు కుదుటపడింది. గేటు తీసుకుని నెమ్మదిగా అడుగులువేస్తూ లోపలికి ప్రవేశించారు.

గేటు చప్పుడు విని, కిటికీలోనుండి చూసిన లక్ష్మి బయటకు వచ్చింది. "మావఁగారూ! మీరా? రండి రండి!" అంటూ లోపలికి దారి తీసింది. "అంతా బావున్నారా మావఁయ్యా!"

ప్రశ్నించింది లక్ష్మి జానకిరామయ్యగారు సోఫాలో కూర్చోగానే.

"అంతా బావున్నారమ్మా! అబ్బాయింకా..." అంటూ అటూ ఇటూ చూశారు జానకిరామయ్యగారు.

"ఇందాకే కారు తీసుకుని క్లబ్బు కెళ్ళారండీ! త్వరగానే వచ్చేస్తారు." అంది లక్ష్మి.

"పిల్లలెలా వున్నారమ్మా?" కళ్ళజోడు తీసి ఉత్తరీయంతో శుభ్రం చేస్తూ అన్నారు.

"కులాసే మావయ్యగారూ!" అంది లక్ష్మి.

అంతలోనే ఆరూ, ఏడూ సంవత్సరాల కుర్రాళ్ళిద్దరూ పరుగెత్తుకుంటు వచ్చారు లోపలికి. ఎదురుగా జానకిరామయ్యగారిని చూస్తూనే ఒక్కసారి ఆగిపోయి తల్లివేపు చూశారు. "రామూ! మీ తాతయ్యరా!" అంది లక్ష్మి.

పిల్లలు "తాతయ్యా!" అంటూ ఒక్కసారి వెళ్ళి జానకిరామయ్యగారి ఒడిలో కూర్చున్నారు.

"బావున్నావా తాతయ్యా?" ప్రశ్నించారిద్దరు ఒకేసారి.

"బావున్నాను. మరి మీరూ?" అన్నారు జానకిరామయ్యగారు.

"మేముకూడా బావున్నాం!" అన్నారిద్దరు.

"ఇక మీరు జరగండి తాతయ్య దగ్గర్నుండి. తాతయ్య అలసిపోయొచ్చారు. స్నానం చేసుకుని భోజనం చేస్తారు." అంది లక్ష్మి.

"అలాగే" అంటూ పిల్లలు ప్రక్క గదిలోకి వెళ్ళిపోయారు.

"ఇక మీరు లేవండి మావగారూ! స్నానం చేసుకుని భోంచేద్దురుగానీ!" అంది లక్ష్మి.

జానకిరామయ్యగారు సోఫాలో నుండి లేచి దుస్తులు మార్చుకుని బాత్‌రూంవేపు వెళ్ళారు.

రాత్రి సరిగ్గా ఎనిమిది గంటలకు ఆనంద్ వచ్చాడు.

"ఎప్పుడొచ్చారు నాన్నగారూ?" తండ్రి కెదురుగానే సోఫాలో కూర్చుని బూట్లు విప్పుతూ ప్రశ్నించాడు ఆనంద్.

పేపరు తిరగేస్తూన్న జానకిరామయ్యగారు పేపరు మడిచి ప్రక్కనే పెడుతూ "సాయంత్రమే వచ్చాను!" అన్నారు కొడుకువేపు పరీక్షగా చూస్తూ —

"అమ్మా, చెల్లాయివాళ్ళంతా కులాసాయేనా?" ప్రశ్నించాడు ఆనంద్.

"అంతా బావున్నారు" అన్నారు జానకిరామయ్యగారు.

ఆ తరువాత ఇద్దరూ కలిసి భోంచేసి డాబా పైన వాలుకుర్చీలో కూర్చున్నారు.

ఇద్దరిమధ్యా కొన్ని క్షణాలు మౌనంగా దొర్లి పోయాక "కరుణకు మళ్ళీ సంబంధాలేమైనా వచ్చాయా నాన్నగారూ!" అన్నాడు ఆనంద్.

"ఆఁ— ఈమధ్యే ఒక సంబంధం వచ్చింది. కుర్రాడు బావున్నాడు. సైన్స్ గ్రాడ్యుయేటు. హైదరాబాదులో ఏదో రీసెర్చి లాబ్‌లో రీసెర్చి ఫెలోగా ఉద్యోగం చేస్తున్నాడు. జీతం కూడా బాగానే వుంది. మన కరుణకు అన్నివిధాల తగిన వాడుగా తోచింది నాకు. వాళ్ళక్కూడా మన కరుణ నచ్చింది. కానీ..." అంటూ ఆగారు జానకిరామయ్యగారు.

"కానీ — ఏమైంది నాన్నగారూ?" ప్రశ్నించాడు ఆనంద్ తండ్రివేపు చూస్తూ.

"అదే — పెట్టుబడులు కాస్త ఎక్కువగా అడిగారు." అన్నారు జానకిరామయ్యగారు.

"అయితే యేం నాన్నగారూ! కుర్రవాడు మనకు అన్ని విధాల నచ్చినతర్వాత పెట్టుబడులు ఎంతడిగితేమాత్రం యేం! — మనం మంచి సంబంధాన్ని వదులుకుంటామా?" అన్నాడు ఆనంద్.

జానకిరామయ్యగారు ఆలోచనల్లో పడ్డారు ఆకాశంవేపు చూస్తూ.

"అదికాదు నాన్నగారూ! ఒకసారి వచ్చి వెళ్ళిన మంచి సంబంధం మళ్ళీ వస్తుందా? మీరు ఆ సంబంధాన్నే ఖాయం చేయండి!" అన్నాడు ఆనంద్.

జానకిరామయ్యగారు అలాగే మౌనంగా ఉండిపోయారు, ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో అర్థంకాక—

"ఏమంటారు నాన్నగారూ!" తిరిగి అన్నాడు ఆనంద్.

చివరకు జానకిరామయ్యగారు సంశయిస్తూనే "అదే — నాక్కూడా ఆ సంబంధాన్నే ఖాయం చేయాలనుందీ — కానీ — పెట్టుబడుల దగ్గర వెనుకంజ వేయాల్సివస్తోంది. ప్రస్తుతం నా ఆర్థిక పరిస్థితి కూడా అంత బాగా లేదు." అంటూ ఆగి— ఇక ఏమైనాసరే అనుకుంటూ — "నువ్వేమైనా సర్దుతావేమోనని..." అంటూ ఆగిపోయారు జానకిరామయ్యగారు.

"అదేమిటి! నేను సర్దడమేమిటి! డబ్బంతా ఏం చేస్తున్నారూ? నెల నెలా మీ పెన్షనూ, నేను పంపే డబ్బూ, అటునుండి రమేష్ పంపే డబ్బూ— ఏం చేస్తున్నారదంతా?" ఒక్కసారి అనేశాడు ఆనంద్.

జానకిరామయ్యగారికి ఒక్కసారి చెంపమీద ఎవరో కొట్టినట్టయింది. అలాగే మ్రాన్పడిపోయారాయన.

"రమేష్ డబ్బు పంపడం మానేసి ఆర్నెల్లయింది. మరినువ్వుకూడా—" అంటూఆగారు.

"అఫ్‌కోర్స్! ఈ మధ్య నాలుగు నెలల నుండి నేను పంపడంలేదనుకోండి! — మీ కోడలికీ, బేబీకీ కొన్ని నగలు చేయించాను. అందుకే పంపడం వీలుపడలేదు. కాని రమేష్ ఎందుకు పంపడంలేదూ? మీరు వాడికి ఉత్తరం వ్రాయలేదూ?" అన్నాడు ఆనంద్.

"ఎన్ని ఉత్తరాలని రాయమూ? — ఒక్క దానిక్కూడా సమాధానం రాకపోయేసరికి మొన్నీమధ్యే వెళ్ళికూడా వచ్చాను వాడి దగ్గరికి—" అన్నారు జానకిరామయ్యగారు.

"ఏమన్నాడూ?" ప్రశ్నించాడు ఆనంద్.

"వాడూ ఏవో కారణాలు చెప్పాడు!" అన్నారు జానకిరామయ్యగారు.

"ఏమో! వాడి పద్ధతి నాకేం నచ్చలేదు." అన్నాడు ఆనంద్.

జానకిరామయ్యగారు నవ్వుకున్నారు లోలోనే ఆ మాట విని.

"నాన్నగారూ! మీరేమైనా అనుకోండి. ఈ విషయంలో మాత్రం నేను నిస్సహాయుణ్ణి! ప్రస్తుతం నాదగ్గర డబ్బు అంతగా లేదు. క్లినిక్ కూడా సరిగ్గా నడవడంలేదు. ఎలాంటి పరిస్థితుల్లో డబ్బు సర్దలేకపోతున్నందుకు క్షంతవ్యుడని!" ఏమాత్రం సంకోచించకుండా అనేశాడు ఆనంద్.

జానకిరామయ్యగారు భారంగా నిట్టూర్చారు.

"నేను రమేష్‌కు రేపే ఉత్తరం రాస్తాను. వాడు డబ్బంతా ఏం చేస్తున్నట్టూ?" అన్నాడు ఆనంద్ తిరిగి.

జానకిరామయ్యగారికి అంత బాధలోనూకూడా నవ్వు వచ్చింది, ఆనంద్ మాటలకు. కాని ఆపుకున్నారు.

అంతలోనే లక్ష్మి వచ్చి పక్క వేసానంటూ చెప్పి వెళ్ళింది.

"పదండి నాన్నగారూ! పడుకుందురుగానీ!" అంటూ వాలు కుర్చీలోంచి లేచారు.

* * *

ఆ మరునాటి దినం ఉదయమే వెళ్ళిపోవాలనుకున్నారు జానకిరామయ్యగారు. కాని ఆనంద్ బలవంతంవల్ల ఆగిపోయారు. ఉదయం పదిన్నరకల్లా టిఫిన్, కాఫీ ముగించుకుని అలా ఊళ్ళోకి బయలుదేరారు.

ఏదో ఆలోచిస్తూ అడుగులు వేస్తున్న జానకిరామయ్యగారు, ప్రక్కనే సడన్‌బ్రేకుతో కారు ఆగేసరికి ఒక్కసారి ఉలిక్కిపడ్డారు. తలెత్తి కార్లోకి చూశారాయన. కార్లో ఖరీదయిన దుస్తుల్లో వున్న వ్యక్తి చిరునవ్వుతో "నమస్కారం మాస్టారూ!" అన్నాడు.

జానకిరామయ్యగారు కళ్ళజోడు సవరించుకుని పరిశీలనగా చూశారు ఆ వ్యక్తివేపు మరోసారి.

"నన్ను గుర్తుపట్టలేదా మాస్టారూ? నేను విశ్వాన్నండీ! ఒకప్పటి మీ స్టూడెంట్‌ను! అదేమిటండీ అప్పుడే మరచిపోయారా నన్ను — కనీసం సరిగ్గా యింకా పది సంవత్సరాలుకూడా కాలేదు..." అంటూ ఏవేవో చెప్పుకుపోతున్న ఆ వ్యక్తిని మధ్యలోనే ఆపుతూ "ఓయ్ విశ్వం నువ్వటోయ్! యెంత పెద్దవాడివయిపోయావ్! నిన్ను వెంటనే పోల్చుకోలేకపోయానుసుమా!" అన్నారు జానకిరామయ్యగారు.

"బతికించారు మాస్టారూ! రండి రండి! కార్లో కూర్చోండి!" అంటూ కారు వెనక తలుపు తెరిచాడు విశ్వం.

జానకిరామయ్యగారు కాస్త సంశయంలో పడ్డారు.

"ఫరవాలేదు మాస్టారూ! ముందు మీరు కార్లో కూర్చోండి." అన్నాడు విశ్వం.

ఇక జానకిరామయ్యగారు నిలవలేకపోయారు. వెంటనే కార్లో వెనకసీట్లో కూర్చున్నారు. కారు ముందుకు సాగింది.

పదిహేను నిమిషాల్లో కారు ఒక అందమైన భవనం ముందు ఆగింది. విశ్వం కారు దిగి, తిరిగి వచ్చి, కారు వెనక తలుపు తెరిచి "రండి మాస్టారూ! యిదే మనిల్లు!" అన్నాడు.

జానకిరామయ్యగారు కారు దిగి ఆ అందమైన భవనాన్ని చూస్తూ విస్తుపోయారు.

ఇద్దరు లోపలి కెళ్ళిపోయారు.

లోపల హాల్లో సోఫా చూపిస్తూ "కూర్చోండి మాస్టారూ!" అన్నాడు విశ్వం.

జానకిరామయ్యగారు నెమ్మదిగా సోఫాలో కూర్చున్నారు.

"చెప్పండి మాస్టారూ! ఏం తీసుకుంటారూ? కాఫీ, టీ, హార్లిక్స్, బోర్నవిటా—ఏదీ ?" అన్నాడు నవ్వుతూ విశ్వం.

"ఇప్పుడే టిఫిన్‌చేసి, కాఫీ త్రాగొచ్చాను యింట్లో. ఇంకేం తీసుకోగలమూ ? కాసిని మంచినీళ్ల తప్ప !" అన్నారు జానకిరామయ్యగారు చిరునవ్వుతో.

"లేదు లేదు. మీరు ఏదో ఒకటి తీసుకోవాల్సిందే — మిమ్మల్ని ఏమీ తీసుకోనివ్వకుండా వెళ్లనివ్వను !" అంటూ "లతా!" అని పిలవగానే, లోపల్నుండి విశ్వం భార్య లత వచ్చింది.

"లతా ! నా చిన్నప్పటి మాస్టారని చెప్పలేదు నీకూ ? ఆయనే వీరు"— అంటూ "మాస్టారూ ! నా సతీమణి !" అంటూ ఒకరి కొకరిని పరిచయం చేసాడు.

లత అతివినయంగా నమస్కారం చేసింది.

"లతా! మాస్టారుగారికి బోర్నవిటా తీసుకురా !" ఆజ్ఞాపించాడు విశ్వం.

"అలాగే !" అంటూ లత లోపలి కెళ్లిపోయింది.

మరు నిమిషంలోనే రెండు కప్పుల్లో బోర్నవిటాతో వచ్చింది లత.

జానకిరామయ్యగారికి ఇక తీసుకోక తప్పలేదు.

"ఇక చెప్పండి మాస్టారూ! ఏమిటి విషయాలూ ? అమ్మా చెల్లాయిలూ బావున్నారా ?" అన్నాడు విశ్వం.

"అంతా బావున్నారు !" అన్నారు జానకిరామయ్యగారు.

"కరుణకు ఏమైనా సంబంధాలు వచ్చాయా?" ప్రశ్నించాడు విశ్వం.

"ఆఁ వస్తున్నాయి — ఒక సంబంధం ఖాయం కూడా అయింది."

"అలాగా ! గుడ్ ! కుర్రవాడు... ..."

జానకిరామయ్యగారు మధ్యలోనే అందుకుని "కుర్రవాడు సైన్స్ గ్రాడ్యుయేట్ ! హైద్రాబాదులోనే ఏదో రీసెర్చి లాబ్‌లో ఉద్యోగం చేస్తున్నాడు. మంచి జీతమే !" అన్నారు.

"అయితే యింకేం ! వెంటనే చేసేయండి !" అన్నాడు విశ్వం.

"అదే నిర్ణయానికొచ్చాను. కానీ..." అంటూ ఆగారు జానకిరామయ్యగారు.

"కానీ... ఏమిటి మాస్టారూ ?" అంటూ జానకిరామయ్యగారి ముఖంలోకి చూశాడు విశ్వం.

జానకిరామయ్యగారు తడబడుతూ "అబ్బే ఏం లేదు — అదంతా నీకెందుకులే !" అన్నారు.

"మాస్టారు ! మీరేదో చెప్పడానికి సంశయిస్తున్నారు. మాస్టారూ ? నేనుకూడా మీకు కొడుకు లాంటివాడిని. నా ముందు సంశయించకండి. చెప్పండి. ఏం జరిగింది ?" అన్నాడు విశ్వం.

జానకిరామయ్యగారికి ఇక దాచుకోవడం అంత భావ్యమనిపించలేదు. తు. చ. తప్పకుండా అంతా చెప్పేశారు.

అదంతా విన్న విశ్వం కళ్ళల్లో నీళ్ళు నిండాయి. కాని పైకి కనపడనివ్వలేదు.

"అన్నట్టూ — నువ్వేం చేస్తున్నావోయ్ ఇప్పుడూ ?" విషయాన్ని మార్చాలన్న ఉద్దేశంతో ప్రశ్నించారు జానకిరామయ్యగారు.

"నేను వ్యాపారంలో దిగాను మాస్టారూ ! మీరు నాకు ప్రసాదించిన విద్యవల్ల, మీ ఆశీస్సుల వల్ల — ఆ భగవంతుడి చల్లని చూపువల్ల నాకే లోటు లేదు జీవితంలో. లక్షాధికారి కాకపోయినా వేలకు వేలు మాత్రం సంపాదించుకోగలుగుతున్నాను." అన్నాడు విశ్వం.

"నేను చాలా సంతోషిస్తున్నాను విశ్వం, నీ యీ హోదాను చూసి. భగవంతుడు నిన్ను యెప్పుడూ యిలాగే వుంచాలని కోరుతున్నాను — మరి నాకు సెలవిప్పిస్తావా విశ్వం !" అన్నారు జానకిరామయ్యగారు సోఫాలోనుండి లేస్తూ.

"మధ్యాహ్నం భోంచేసి వెళ్లండి మాస్టారూ!"

"వద్దు వద్దు. ఇప్పటికే చాలా ఆలస్యమయింది. పిల్లలు నాకోసం యెదురుచూస్తూ వుంటారు." అన్నారు జానకిరామయ్యగారు.

"సరే అలాగే మాస్టారూ !" అంటూ లేచాడు విశ్వంకూడా.

జానకిరామయ్యగారు బయటికి వచ్చేశారు.

ఆ సాయంత్రమే జానకిరామయ్యగారు అక్కడ నుండి తిరుగు ప్రయాణమయ్యారు.

*  *  *

"పిల్లలంతా కులాసాయేనా ?" ప్రశ్నించింది సావిత్రమ్మ జానకిరామయ్యగారు యింట్లో అడుగు పెట్టగానే.

"ఆఁ కులాసాయే !" ఉత్తరీయం గోడకున్న వంకెకు తగిలిస్తూ అన్నారు జానకిరామయ్యగారు.

"కరుణ సంగతి చెప్పారా ?" ప్రశ్నించింది సావిత్రమ్మ.

"చెప్పాను." అన్నారు జానకిరామయ్యగారు.

"ఏమన్నాడూ ?" ప్రశ్నించింది సావిత్రమ్మ.

"ఏమంటాడూ ? ఉన్నపళంగా డబ్బు కావాలంటే వాడు మాత్రం ఏం చేయగలడూ ! ఎక్కడ్నుండి తీసుకురాగలడూ ?" అన్నారు జానకిరామయ్యగారు.

"అవున్లెండీ ! వాడు డబ్బు లేదని అనివుంటాడు. అది మీరు తిన్నగా చెప్పలేక, పైగా వాడ్ని వెనకేసుకొస్తున్నారు. వాడంటే మీకు చాలా ప్రేమగా మొదట్నుండీ ! అందుకే — అవున్లెండీ ! మనం పస్తులుండీ, అప్పులుచేసి వాడ్ని చదివించిన రోజులు మరచిపోయుంటాడు వాడు బహుశా !" అంది సావిత్రమ్మ.

"సావిత్రీ ! అలా అనకు. అది మన కనీస కర్తవ్యం ! ఇందులో వాడ్ని నిందించి లాభంలేదు అంతా మన దురదృష్టం !' అన్నారు జానకిరామయ్యగారు.

"ఈ నీతిబోధలు నాకు చేసేకన్నా వాడికే చేయాల్సింది అక్కడ మీరు." అంది సావిత్రమ్మ

జానకిరామయ్యగారు ఏమీ మాట్లాడలేదు.

అంతవరకూ తలుపు చాటున వుండి అంతా విన్న కరుణ ఒక్కసారి మెరుపులా ముందుకువచ్చి "నాన్నా ! నాకీ పెళ్లొద్దు ! నేను ఉద్యోగం చేయదలచుకున్నాను ఇదిగో నా అప్పాయింట్‌మెంటు ఆర్డరు." అంటూ చేతిలో వున్న కవరులోంచి ఆర్డరు కాగితాన్ని బయటికి లాగింది.

"అమ్మా కరుణా ! ఏమిటమ్మా నీ యీ నిర్ణయం ?" అన్నారు జానకిరామయ్యగారు.

"అవున్నాన్నగారూ ! నాకీ పెళ్లొద్దు ! నా పెళ్లికోసం మీరు ఎవరినీ అర్థించాల్సిన అవసరం లేదు నా పెళ్లి స్వయంగా నా డబ్బులతోనే చేయాలి మీరు. అప్పటివరకూ మీరు యెవరినీ చేయిచాచ నవసరంలేదు." అంటూ లోపలి కెళ్లిపోయింది కరుణ.

సావిత్రమ్మ, జానకిరామయ్యగార్లు శిలాప్రతిమలే అయ్యారు కరుణ మాటలు విని.

ఆ తరువాత రెండురోజులకు జానకిరామయ్య పేరిట ఒక ఇన్స్యూర్డ్ పార్సెల్ వచ్చింది. జానకిరామయ్యగారు ఆత్రుతగా సంతకంచేసి తీసికొని లోపలికొచ్చి పార్సెలు విప్పారు. ఒక్కసారి కళ్లు చెదిరిపోయాయి ! అన్నీ వందరూపాయల నోట్లు. ఆశ్చర్యపోయారు ! నెమ్మదిగా వాటిని బయటకు తీసారు. వాటితోపాటు ఓ చిన్న చీటీ కూడా వుంది. జానకిరామయ్యగారు ముందు ఆ చీటీ విప్పారు గబగబా.

## ఆశాజీవి

— బొర్రా పాండురంగశాస్త్రి

జీవితం, ఆశామయం !
జీవితాశయం, ఆనందజీవనం !
జీవనగమనం ఒడిదుడుకుమయం !
'కష్టసుఖాలు కావడి కుండలని'
సరిపెట్టుకుని ముందడుగు వేద్దామంటే,
'ఎండమావులు ఎదురవుతున్నాయి !'
అయినా, మానవుడు నిరాశ చెందకుండా,
శాంతి సుఖాల కోసం,
కుటుంబ సంతోషం కోసం,
తపన చెందుతున్నాడు
తపస్సు చేస్తున్నాడు
అహర్నిశలు శ్రమిస్తున్నాడు !
శ్రమజీవనమే,
సుఖజీవనమని
అతడెరిగిన పరమ సత్యం !
అందుకే, అతడు పట్టు వదలక,
పరిశ్రమ చేస్తున్నాడు !
ఆ కాంతి రేఖలు, అతడి
మనసులో మెదులుచున్నాయి !
ఆ, ఆశాజ్యోతులు, అతడి
కళ్లముందు వెలుగుతున్నాయి !
ప్రయత్నం మన ధర్మం !
ఫలితం దైవనిర్ణయం
అంటే నాగరికు లంగీకరించరు
కనుక, ఫలితం మన కృషిఫలం అందాం
అందుకే, మానవుడు 'ఆశాజీవి !'





పసి బిడ్డకు
జీర్ణసంబంధమైన
బాధలు కలిగినప్పుడు...

సౌమ్యంగా పనిచేసే

# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్

బాధను అతి త్వరగా తగ్గిస్తుంది




గృహౌషధములు
తయారుచేయుటలో
తరతరాలుగా
నమ్మికకు పాత్రమైన
అమృతాంజన్ వారి
తయారి.

కడుపునొప్పి, అజీర్ణము, వాయువు, పళ్ళు వచ్చేటప్పుడు కలిగేబాధలు మొదలైన వాటిలో దేనితోనైనా సరే, మీ పసిబిడ్డ బాధ పడుతూంటే అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్‌తో అతి త్వరగా ఉపశమనం కల్గించండి త్వరగా సులభంగా తిరిగి మీ పసిబిడ్డ ఆనందంగా నవ్వుతుంది.

అమృతాంజన్ లిమిటెడ్

OBM 3410 TG

## డాక్టర్ సలహాలు * — డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

సి. ఎస్. ఆర్. — విశాఖపట్నం

నా వయస్సు 18 సం.లు. నాకు అప్పుడప్పుడూ వీపులో యెడమవైపు నొప్పి వస్తుంది. ఊపిరి తీసేటప్పుడు గుండెల్లో నొప్పిగా వుంటుంది. 'అనాల్‌జిన్' మొ. మాత్రలు వాడాను. కాని లాభం కన్పించలేదు.

★ వీపులో నెప్పి అనేది తరచూ రావటంవల్ల, "వీపు" (ఛెస్ట్) భాగాన్ని "ఎక్స్‌రే" తీసి చూడవలసిన పరిస్థితి వుంది. దీనికి మీ అంతట మీరే వైద్యం చేయ ప్రయత్నించటం మంచిది కాదనటానికి మీరు వాడిన మాత్రలు పని చేయక పోవటమే ప్రత్యక్ష నిదర్శనం!

"డ్రైప్లూరసీ" వల్ల గాని, వెన్నుపూసల అమరికలో ఏర్పడగలిగిన మార్పులవల్ల గాని తరచూ నెప్పి రావచ్చును. ఊపిరితీసే సమయంలో నెప్పి వుండటం శ్వాసమండలంలోని భాగాలయిన, ఊపిరి తిత్తులు, గాలి పయనించటానికి వున్న గొట్టములు, ఊపిరితిత్తుల పైపొరలు మొ.న వాటిలోని లోపాలని సూచిస్తుంది. మీరు ఎక్స్‌రే తీయించి, వైద్య సలహా పొందడం మంచిది.

ఎమ్. ఆర్. ఆర్. — మద్రాసు

నాకు 15 రోజుల కొకమారు విరోచనము లవుతున్నవి. మలంలో "ఎస్కారిస్ లుంబ్రి కాయిడ్స్" వున్నట్లు తెలిసింది. మిగతా రోజుల్లో మలబద్ధకంతోబాటుగా యెక్కువగా "గ్యాస్" పోతోంది.

★ మీ ముందు జాగ్రత్తలకు ఒక వైద్యునిగా అభినందనలు తెలియజేస్తున్నాను.

ఎవరికైనాసరే, విరేచన సంబంధ రోగాలు వుంటే నిపుణులైనవారిచేత మల పరీక్ష దాదాపు ఆరు నెలల కొకసారైనా చేయించుకొంటే, వారే ఆశ్చర్యపడే సంగతులు బయటపడతాయని తెలియ జేయటానికి మీరు చేయించుకొన్న "మల పరీక్ష" మంచి నిదర్శనం అయింది. మీకు పొడవైన (6 నుంచి 10 వరకు) గుండ్రంగా వుండే పురుగులు వున్నాయని తేలింది. కాబట్టి "పైపరజీన్ సిట్రేట్" అనే మందు రాత్రి భోజనానంతరం 50 సి.సి.ల వంతున ($1\frac{1}{2}$ ఔన్సులు) లోనికి వరుసగా రెండు రాత్రులు తీసుకోవటం అవసరం. 10 రోజుల అనంతరం తిరిగి మలపరీక్ష చేయించు కొని, పూర్తిగా పురుగులు పోయేదాకా నెల కొకమారు మాత్రం ఈ మందు వాడాలి. మలబద్ధకం, గ్యాస్ మొ.వి వీటి ప్రభావం వలననే రావచ్చును.

వి. ఎమ్. ఎన్. — హైదరాబాద్

మా తమ్ముడి వయస్సు 18 సం.లు. చిన్నప్పుడు ఫిట్సు వచ్చి ఎడమచెయ్యి, కాలుపాదము వంకర తిరిగినవి. వేళ్ళల్లో పటుత్వములేదు. ఎడమ చేత్తో ఏ పనీ చెయ్యలేడు. ఫిట్సు వచ్చినప్పుడు 'ఎక్కువ మోతాదు'లో ఇంజక్షన్‌లు ఇవ్వటమువల్ల యిలా జరిగిందని అనుకొనుచున్నాము. మీ సలహా కోరుచున్నాము.

★ ఫిట్సు వచ్చినది, రోగలక్షణమైన సంగతి ముందుగా తెలియజేస్తూ; ఒకవైపు శరీర భాగాలు పని చేయకపోవటానికి; మెదడునుంచి (ఎదటి వైపున వున్న మెదడులోని అర్ధభాగం నుంచి) వచ్చే నరాలు "కూడలి" లేక ఒకచోట క్రమంగా కుమిగూడివున్న ప్రదేశంలో ఏర్పడిన అవాంతరాల వల్లనే అని తెలియజేయటంకూడా అవసరమే అని అనుకొంటాను. ఈ "భాగం" దెబ్బతినే సమయంలో ముందుగా "ఫిట్సు" (ఉపయోగపడని భాగాలలో) ఏర్పడటం, రాబోయే అవాంతరాన్ని సూచిస్తుంది. ఇంజక్షన్‌కి, గాని మోతాదుకి ఈ ప్రస్తుత పరిస్థితికి సంబంధం లేదని సంశయం లేకుండా చెప్పగలను. ఇకపోతే యీ రోగాన్ని నివారించాలంటే "ఫిజియో తెరపీ" (వ్యాయామ పద్ధతులు) క్రమంగా చేయించటమే!

ఎ. ఎన్. — తిరుపతి

నాకు 6 నెలల నుండి 'హెర్నియా' వున్నది. అది దగ్గినప్పుడంతా పెద్దదవుతుంది. దాన్ని అలా వదిలివేయవచ్చునా? పెద్దదవకుండా వుండుటకు తీసుకొనవలసిన జాగ్రత్తలేమిటి?

★ "హెర్నియా" అనే జబ్బు - ఉదర భాగంలోని "గోడలలో" ఇమిడివున్న కండరాల పటుత్వం తగ్గినా, లేక జీర్ణకోశం మొదలయిన భాగాలు అమరివున్న ఉదరభాగంలో "పీడనశక్తి" (ప్రెషర్) ఎక్కువ అయినా; లేక యీ రెండూ ఒకే సమయంలో వున్నా ఉదర భాగాలలో కదలిక (వున్నవి ముఖ్యంగా చిన్నప్రేవులు) పటుత్వం తప్పిన ఉదరభాగాన్ని కప్పివుంచుతున్న గోడలలో ఖాళీ ఏర్పరస్తూ వచ్చి, క్రమేపీ బయటికి, దగ్గినా, తుమ్మినా, మలబద్ధకం వున్నా, రావటం అనేదే! కొన్ని సమయాలలో అంతర్గతంగానే కొన్ని భాగాలు యితర భాగాలలోనికి చొచ్చుకొనిపోవటానికి **హెర్నియా** అనే పదం వర్తిస్తుంది.

మీరు శస్త్ర వైద్యులకి చూపించి, ఆ "హెర్నియా" ప్రమాద స్థలంలోనో లేక ప్రమాదకర పరిస్థితిలోనో వుందని వారు చెపితే వెంటనే శస్త్రచికిత్స చేయించుకోవటం, అంత తొందరలేదని వారంటే "బెల్ట్" మొదలయినవి సైన్స్ ప్రకారం కొని వాడటం, పై కారణాలకి తగిన చికిత్స చేయించుకోవటం అవసరం.

---

## నల్ల గులాబీ

మాస్టారూ!

నమస్కారం. గుర్తుపట్టారనుకుంటా! నేను విశ్వాన్ని. మీరు యింటికి క్షేమంగా చేరివుంటారని తలుస్తాను

మాస్టారూ! నేను యీ ఉత్తరంతోబాటు అయిదువేలు పంపుతున్నాను. ఈ డబ్బు చెల్లాయి కరుణ పెళ్లికి ఏవిధంగానైనా తోడ్పడవచ్చు. ఇంత చిన్న మొత్తం పంపుతూన్నందుకు నేను బాధపడు తున్నాను. కాని యిందుకు కారణం లేకపోలేదు. అసలు ఆరోజే మీకు డబ్బు యిద్దామనుకున్నాను. కాని యివ్వలేదు. ఎందుకంటే — మీరు తీసుకోరని నాకు ఖచ్చితంగా తెలుసు. అందుకే యివ్వలేదు.

మాస్టారూ! మీరు నాకు ఎంతో సహాయం చేసారు. నా జీవితానికే గుర్తింపులేని సమయంలో నన్ను ఆదుకున్నారు. మా అమ్మ నన్ను చదివించలేని స్థితిలో వున్నప్పుడు మీరు నాకు ట్యూషన్లు చెప్పి. నా చదువుకు చాలా తోడ్పడ్డారు. మీ సహాయం నా జీవితాని కొక చక్కని బాట నేర్పరచింది. నేను ఆ బాటగుండానే పయనించి నా గమ్యం చేరుకో గలిగి, ఈరోజు యింతటివాడినయ్యాను. ఇదంతా కేవలం మీ చల్లని చూపువల్లే! ఆరోజు మీ యీ చల్లనిచూపే లేకపోయింటే యీరోజు నా పరిస్థితి ఎలావుండేదో ఊహించుకోలేను. నేనవన్నీ మరవలేదు మాస్టారూ! మరవలేదు!

మాస్టారూ నేను మీకు చాలా ఋణపడివున్నా! కాని ఆ ఋణాన్ని యిప్పుడు యీవిధంగా తీరుస్తున్నానని మాత్రం అనుకోకూడదు దయచేసి! యీ డబ్బు నేను సంతోషంగా నా చెల్లాయి పెళ్లికి సమర్పిస్తున్నాను. దీన్ని మీరు తప్పకుండా స్వీకరించాలి!

ఇట్లు,
విశ్వం.

ఉత్తరం చదివిన జానకిరామయ్యగారి కళ్ళల్లో నుండి రెండు భాష్పాలు రాలాయి.

వెంటనే బల్ల దగ్గరకు వెళ్లి కుర్చీలో కూర్చొని సొరుగులో నుండి తెల్లకాగితం తీసి —

చిరంజీవి విశ్వంకు,

ఆశీస్సులతో నీ మాస్టారు వ్రాయునది. నీవు ప్రేమతో పంపిన డబ్బు అందింది. చాలా కృతజ్ఞుణ్ణి! నీవు డబ్బులో, హోదాలోనే గొప్పవాడివనుకున్నా — కాని నీ మనసుకూడా యింత గొప్పదని నేనెన్నడూ ఊహించని విషయం! మనిషికి డబ్బే ముఖ్యంకాదని నిరూపించుకున్నావు! నీ మంచితనాన్ని నేను భరించ లేకుండా వున్నాను.

కాని — విశ్వం! ప్రస్తుతం కరుణ వివాహం చేసుకోవడంలేదు. తన ఉద్దేశ్యాన్ని మార్చుకుని ఉద్యోగంలో చేరింది. అందుకే, నీవు పంపిన డబ్బును ఏవిధంగామా సద్వినియోగం చేసుకోలేక పోతూన్నందుకు చింతిస్తున్నాను. డబ్బు తిరిగి నీకే పంపుతూన్నందుకు ఏమీ అనుకోకూడదు. విశ్వం! నీకు మాపై వున్న అభిమానానికి విలువ కట్టలేకపోతూన్నాం.

అమ్మాయికి ఆశీస్సులు — వుంటా! సెలవు! అంటూ ఉత్తరం పూర్తిచేసారు జానకి రామయ్యగారు.

# ★ సినిమా విశేషాలు ★




'మంచికి మరో పేరు'లో ఎన్.టి.ఆర్.

## రెండు చిత్రాలను చూస్తారు

రామారావుగారి "దాన—వీర—శూర—కర్ణ" చిత్రాన్ని, అంజనేయులుగారి "కురుక్షేత్రం" చిత్రాన్ని (రెండింటినీ) ప్రేక్షకులు వుత్సాహంతో చూస్తారు. రెండు చిత్రాలకు "మహాభారతం" ఆధారమే అయినా, ఒకటి కర్ణుడి జీవితంపై అల్లబడినది; మరొకటి ద్రౌపది మీద అల్లబడినది గనక, రెండింటి మధ్య ఎంతో వ్యత్యాసం కనిపిస్తుంది.

ఆహార్య, అభినయ, అలంకరణ విషయంలో యిద్దరూ రాజీపడే వ్యక్తులు కారు. సంగీతం సమకూర్చే పెండ్యాల... రాజేశ్వరరావు గార్లు పౌరాణిక చిత్రాలకు అద్వితీయులు.

మనసున్న మన ప్రేక్షకులు రెండు చిత్రాలను ప్రేమతోనే ఆదరిస్తారు. ఎంతో ఖర్చుపెట్టి చిత్రాలను నిర్మించేవాళ్లను, శపించే శక్తి ఆంధ్ర ప్రేక్షకులకు లేదు. "నటరత్న" గారి "దాన—వీర—శూర—కర్ణ", కృష్ణగారి "కురుక్షేత్రం" తెలుగు చలన చిత్ర చరిత్రలో మణిమకుటాలుగా నిలిచిపోతాయి.

## నగేష్ దర్శకత్వంలో జయసుధ

మూడు వందల చిత్రాల తర్వాత, నాగేష్‌కు దర్శకత్వం చెయ్యాలనిపించడం, తన అభిప్రాయాన్ని రామానాయుడుగారికి వెలిబుచ్చడం, "సరే కానివ్వండి" అని ఆయన హామీ యివ్వడం వరకు జరిగిన నిజాన్ని, పాఠకులకు గత వారం తెలిపాను.

"మొరటోడు" అని పేరు కూడా పెట్టారు, దర్శకుడు నాగేష్.

దీపావళి రోజున జయసుధకు కథను వినిపించాడు. ఆమె కథ వింటూ అనేకసార్లు కంట తడి పెట్టింది. (కథలో అంత సెంటిమెంట్స్ వున్నాయి.)

ఇంతవరకు జయసుధ చేసిన పాత్రలకు, చేస్తున్న పాత్రలకు భిన్నంగా వుండే వుదాత్తమైన పాత్రను, నగేష్ "మొరటోడు" చిత్రంలో ఆమెకు యిచ్చాడు.

"టైటిల్ రోల్"ను ఎవరు చేస్తున్నారో తెలుసా? క్యారెక్టర్ యాక్టర్, సత్యనారాయణగారే.

## తనయులు తీసే సినిమా

"మొరటోడు" చిత్రానికి మోదుకూరి జాన్సన్ మాటలను, విశ్వనాధన్ సంగీతాన్ని, వెంకట్ ఛాయాగ్రహణాన్ని నిర్వహించగలరని, సురేష్ అధినేత చెప్పారు.

"మొరటోడు" చిత్రాన్ని రామానాయుడుగారి యిద్దరు తనయులు సురేష్... వెంకటేష్ నిర్మిస్తారు.

డిశంబరు నుంచి షూటింగు ప్రారంభమై, మార్చికి షూటింగు పూర్తి అవుతుంది, అన్నారు దర్శకుడు నగేష్.





## శ్రీధర దర్శకత్వంలో శ్రీధర్

ప్రముఖ దర్శకుడు శ్రీధర్ దర్శకత్వంలో సి. పి. ఆర్. ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న సాంఘిక చిత్రంలో శ్రీధర్ (ముత్యాలముగ్గు ఫేం) హీరోగా నటిస్తున్నాడు. అతనికి జతగా కవిత నటిస్తూంది. చక్రపాణి, భవానీ మరొక జంటగా కన్పిస్తారు.నిర్మల, వీరాజా, ప్రసాద్ తదితర పాత్రలను చేపట్టారు.

సి. పి. ఆర్. ప్రొడక్షన్స్ చిత్రానికిగాను ఆత్రేయ కలం రెండు ఆణిముత్యాల్లాంటి పాటలను సృజించింది. ఆ రెండు పాటలను గానకోకిల సుశీల గానం చేసింది స్వరబ్రహ్మ మహదేవన్ సంగీత సారథ్యంలో. ఆ రెండు పాటల పల్లవి ఇలా వుంది.

1. "కన్నతల్లులు కథ చెబుతారు,
   చిన్నపిల్లలు "వూ"కొడతారు,
   "వూ" అనలేవు, ఏమనలేవు
   నా కథ నీకు యెలా చెప్పను."
2. "ఎందుకు నాకొక మనసిచ్చావు
   మనసుకు వయసుకు తోడిచ్చావు
   మనసులోని ఆశలను
   వయసులోని ఆవేశాలను
   పెంచి పెంచి నను ముంచేశావు."

పై రెండు పాటలను కుమారి కవితమీద చిత్రీకరిస్తారు.

అక్టోబర్‌లో ఆరంభమైన యీ చిత్రం నవంబర్ మొదటి వారానికి పూర్తవుతుంది. ఒకే షెడ్యూల్లో చిత్రమంతా పూర్తిచేయబడుతుంది.

ప్రముఖ నిర్మాత ఏ. పూర్ణచంద్రరావు ఆధ్వర్యంలో సి. పి. రెడ్డి నిర్మిస్తున్న ఈ చిత్రానికి ఆత్రేయ మాట, పాటలను, కె. వి. మహదేవన్ స్వరాలను, బాలకృష్ణన్ కెమెరాను, జి. వి. సుబ్బారావు కళను, చక్రవర్తి సహకార దర్శకత్వమును, సత్యనారాయణ ప్రొడక్షన్ నిర్వహణను సమకూర్చే బాధ్యతలను స్వీకరించారు.

## శ్రీధర్ సీజన్

"ముత్యాలముగ్గు" హీరో శ్రీధర్ ప్రస్తుతం శుక్రదశను అనుభవిస్తున్నాడు. ఒడ్డు, పొడుగుతో బాటు నటనా నైపుణ్యం అర్హతగా, బడపియున్న శ్రీధర్ తొలుదొల్త "శభాష్ పాపన్న"లో విలన్‌గా వెండితెరకు పరిచయమయ్యాడు. ఆ తర్వాత "పండంటి సంసారం" లాంటి చిత్రాల్లో హీరోగా నటించాడు. మళ్లీ "యశోదకృష్ణ" చిత్రంలో వసుదేవుడి పాత్రలో కన్పించాడు. ఒకసారి హీరోగా నటించి, మళ్లీ వేరే ట్రెండ్‌లో ముందుకు సాగడం ముందు జీవితానికి ఆటంకమవుతుందేమో అన్న అనుమానాన్ని కొందరు శ్రీధర్‌తో చర్చించారు. కానీ వారి మాటలకు శ్రీధరిచ్చిన సమాధానం సరి అయినదన్పించింది. ఎలా రాసుంటే అలా జరుగుతుంది కానివ్వండి అంటూ ఎంతో తేలిగ్గా బదులిచ్చాడు శ్రీధర్.

అతని నమ్మకం వమ్ముకాలేదు. బాపూ, రమణల నిర్దేశకత్వంలో "ముత్యాలముగ్గు"లో నటించి అందరి మెచ్చుకోలుకు పాత్రమయ్యాడు.

## మరువలేని మధురానుభూతి

"నేను హీరోగా నటించిన చిత్రం వందరోజులు ప్రదర్శింపబడి ఆ సందర్భంగా నటసమ్రాట్ నాగేశ్వరరావుగారి చేతులమీదుగా షీల్డు తీసుకోవడం నేను మర్చిపోలేను. పోనుకూడా. మరో మధురానుభూతి ఏమిటంటే, "ముత్యాలముగ్గు" చిత్రానికి కేంద్రప్రభుత్వ అవార్డు, రాష్ట్ర ప్రభుత్వం అవార్డు రావడం, ఆ అవార్డుల పండుగలో నేను పాలుపంచుకొనే అదృష్టం నాకు లభ్యమవడం. నా జీవితానికొక క్రొత్త బాటను వేసిన నిర్మాత ఎంవీయల్ గారికి, శ్రీయుతులు బాపూ, రమణలగారికి, నన్ను ఆదరిస్తున్న పరిశ్రమవాసులకు, ప్రేక్షకకోటికి నా మనఃపూర్వక కృతజ్ఞతాంజలులు అర్పిస్తున్నాను" అన్నాడు శ్రీధర్.

## విశ్వభారతిలో శ్రీధర్

లోగడ నటసామ్రాట్‌తో రెండు భారీ చిత్రాలను నిర్మించిన విశ్వభారతి ప్రొడక్షన్స్ ప్రస్తుతం మరో చిత్ర నిర్మాణాన్ని తలపెట్టింది. జె. రాధాకృష్ణమూర్తి నిర్మించే యీ చిత్రానికి సింగీతం శ్రీనివాసరావు దర్శకుడు. శ్రీధర్ హీరోగా నటిస్తున్నట్లు, నవంబర్‌లో షూటింగ్ ప్రారంభమని తెలుస్తూంది.

'ముత్యాల పల్లకి'లో జయసుధ





'చక్రధారి'లో జయప్రద, వాణిశ్రీ

## కృష్ణంరాజు సెలక్షన్

పాత్రలు బావుండి, తనకు పేరు తెస్తాయి అనిపిస్తేనే, కృష్ణంరాజు చిత్రాలను ఒప్పుకుంటారు. ఆయన వదిలేసిన కొన్ని చిత్రాలు అపజయాన్ని చవిచూచాయి.

'హీరోగా వచ్చి ... విలన్‌గా మార్పుకుని ... మళ్లీ హీరోగా యిమేజ్ ఏర్పరచుకున్న కృషీవలుడు కృష్ణంరాజు. హీరోగా చిత్ర చిత్ర ప్రవర్ధమానమవుతున్న కృష్ణంరాజు గోపీకృష్ణ మూవీస్‌ను స్థాపించి, ఉత్తమ చిత్రాలను అందిస్తున్నారు.

"రెబల్‌స్టార్" నటించిన చిత్రాలు (1976లో) నిర్మాతలకు నష్టాన్ని తేలేదు. పైగా పెద్ద లాభాలను తెచ్చిపెట్టాయి. ఇప్పుడాయన నటిస్తున్న చిత్రాలు: "మంచికి మరో పేరు; పచ్చబొట్టు; ప్రపూర్ణా మూవీస్; మహానుభావుడు; మారుతీ కంబైన్స్; శ్రీ లక్ష్మి నరసింహా కంబైన్స్ మరియు మాధవీ...పద్మాలయా కంబైన్స్."

రాధేయుడుగా కృష్ణంరాజు హుందాగా, అందంగా, గంభీరంగా వున్న విజాన్ని యీ విశేఖరి చూచాడు.

## అన్నపూర్ణా స్టుడియోస్, అందరిదీను

"నటసామ్రాట్" నాగేశ్వరరావుగారు నిర్మించిన అన్నపూర్ణా స్టుడియోస్, ఆయన చిత్రాలకు మాత్రమే గాక, యితర నిర్మాతలకు కూడా లభించే సౌకర్యాన్ని ఏర్పరచడానికే, మరో రెండు ఫ్లోర్లు తయారుచేస్తున్నారు.

ప్రముఖ హిందీ చిత్ర దర్శకుడు గుల్జార్ విజయదశమినాడు అన్నపూర్ణా స్టుడియోస్‌ను విజిట్ చేసినప్పుడు "యిట్ యీజ్ ఎ వండర్‌ఫుల్ స్టుడియో", అని అభినందించారు. మూడవ ఫ్లోర్‌కు శంకుస్థాపన చేశారు.

ఇప్పుడున్న రెండు ఫ్లోర్సు అక్కినేనిగారి చిత్రాలను మాత్రమే ఫీడ్ చేస్తున్నాయి. అలా జరక్కుండా, అందరికీ అందుబాటులో ఉండేందుకే మరో రెండు ఫ్లోర్లు, అన్నారు నాగేశ్వరరావు. ఒకటి సంక్రాంతికి, యింకొకటి వచ్చే ఉగాదికి రెడీ అవుతాయి, అన్నారు అక్కినేని.

## హైదాబాదులో జరుగుతున్న చిత్రాలు

ప్రస్తుతం మదరాసుకన్న, హైదరాబాదులోనే చిత్రాల షూటింగులు ఎక్కువగా జరుగుతున్నాయి. ఎప్పుడు, ఏ స్టుడియోకు వెళ్లినా, తెలుగు షూటింగు అరుదుగా వుంటూంది. ఏ ఆర్టిస్టుకు ఫోను చేసినా, హైదరాబాదుకు వెళ్లారు అనే సమాధానం వస్తూవుంది.



# సినిమా...

హైదరాబాదులో ఎన్ని చిత్రాల షూటింగులు జరుగుతున్నాయో తెలుసా? అన్నపూర్ణా పిక్చర్స్‌వారి "ప్రేమలేఖలు." శ్రీ అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైజస్ వారి "కల్పన." శ్రీ లలితా మూవీస్‌వారి "ఇదెక్కడి న్యాయం." శ్యాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి "రంభ ... ఊర్వశి...మేనక." రామకృష్ణా సినీ స్టుడియోస్ వారి "దాన...వీర...శూర...కర్ణ మరియు చాణక్య...చంద్రగుప్త." ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి వర్ణ చిత్రం, జగపతి పిక్చర్స్ వారి "బంగారు బొమ్మలు" వర్ణ చిత్రం.

పై నుదహరించిన చిత్రాలు గాక, మరో పదిమంది ఆంధ్రదేశంలోని పలుప్రాంతాలలో షూటింగు జరుపుతున్నారు.

## ప్రతి మూడుమాసాల కొకటి

హీరో నాగేశ్వరరావుగారితో చిత్రం నిర్మించే వారికి, మూడుమాసాల్లో "డబ్బింగ్ ... ప్యాచ్ వర్కు" పూర్తిచేసుకునే సదుపాయం వుంది.

కథ రెడీ అవ్వాలేగాని, డైలాగు పుస్తకాన్ని పూర్తిచేసుకుని ఆయన దగ్గరకు వెళ్లాలేగాని, ఆయన వరుసగా మూడు x 15 రోజులు ప్రతి నిర్మాతకు కేటాయించే పద్ధతిని అమలు పరుస్తున్నారు.

మూడు మాసాల్లో హీరో పిక్చర్ పూర్తి చెయ్యడంతో, యెంతో ఖర్చు కలిసివస్తుంది. నాలుగోనెల చిత్రాన్ని విడుదల చెయ్యొచ్చు.

ప్రతి మూడు నెలలకు ఒక చిత్రం విడుదల చేసుకుంటే, నిర్మాతలకు రిలీజ్ కన్‌ఫ్యూజన్‌కూడా వుండదు. ఈ పద్ధతిని అవలంభించడంవల్ల, సంవత్సరానికి అయిదు చిత్రాలు మాత్రమే విడుదలవుతాయి. ప్రతి నిర్మాతకు (పిక్చర్ బావుంటే) కనీస లాభాలు వస్తాయి.

'కల్పన'లో జయచిత్ర, మురళీమోహన్



'అత్తవారిల్లు'లో ప్రభ, మమత

## ఫిబ్రవరి నుంచి ఓ మై డార్లింగ్

అనకాపల్లి అప్పారావు, చెన్నపురి భీమేశ్వరరావు, భాగ్యనగరం నాగేశ్వరరావు కలిసి పని చెయ్యబోతున్న ''ఓ మై డార్లింగ్'' వర్ణ చిత్రం ఫిబ్రవరి నుంచి అన్నపూర్ణా స్టుడియోస్‌లో ప్రారంభమవుతుంది.

''నటసామ్రాట్'' ''గిటార్'' సింగర్‌గా కొత్తతరహా పాత్రను పోషిస్తున్న ''ఓమై డార్లింగ్'' చిత్రంలో హార్స్ రైడింగ్, మోటార్‌సైకిల్ రేసింగ్ లాంటి ఎన్నెన్నో కమర్షియల్ అంశాలు వుండగలవని తెలుస్తోంది.

## పాత్రోకు ప్రమోషన్

''ఓ మై డార్లింగ్'' వర్ణ చిత్రానికి గణేష్‌పాత్రో మాటల రచయితగా ఎంపిక కావడం, ఆయన భవిష్యత్తుకు బాగా వుపకరించే సంఘటనగా పేర్కొనవచ్చు. అలాగే భీమేశ్వరరావుకు అక్కినేని చిత్రం రావడం యెంతేని ముదావహం.

## నిర్మల గెలుస్తుంది

''దేవుడే గెలిచాడు'' చిత్రాన్ని జనరంజకంగా రూపొందించిన విజయనిర్మలగారి ప్రతిభను ప్రేక్షకులు ప్రశంసిస్తారు. బాక్సాఫీస్‌వద్ద ఆమె గెలుస్తుంది.

కొత్తరకం కథను ఎంపిక చేసింది. అసహజమైన దృశ్యాలను దూరం చేసింది. ప్రతి పాత్రకు ఒక స్పిరిట్ నిచ్చింది. అన్ని పాత్రలకు సమాన ప్రాతినిధ్యం యిచ్చింది. మెలోడ్రామాకు స్వస్తి చెప్పింది. సహజత్వాన్ని రాబట్టుకుంది. ప్రతి నిమిషం స్క్రిప్టుపై కేంద్రీకృతం చేసింది. షాటు డివిజన్ చక్కగా చేసుకుంది. ఇన్ని చేసిన విజయనిర్మల గెలుపు తనదిగా చేసుకుంటుంది.

''దేవుడే గెలిచాడు'' చిత్రంలో కృష్ణ, జగ్గయ్య, గుమ్మడి, బాలయ్య, విజయనిర్మల, రమాప్రభ, నిర్మల, మమత, మోహన్‌బాబు ప్రధాన పాత్రలను పోషించారు.

మాటలను అప్పలాచార్య, సంగీతాన్ని రమేష్ నాయుడు, ఛాయను పుష్పాల నిర్వహించారు.

''విజయనిర్మల విల్ విన్ ది రేస్''.

## నాగలాపురంలో మనిషిలో మనిషి

శ్రీ మాధవీ ఎంటర్‌ప్రైజస్ బ్యానరుపై పి. చిన్నపరెడ్డి నిర్మిస్తున్న ''మనిషిలో మనిషి'' చిత్రం షూటింగ్ అక్టోబర్ నెల 3 నుంచి 6 వరకూ నాగలాపురంలో జరిగింది. మళ్ళీ అక్టోబర్ 17 నుంచి 20 వరకూ నాగలాపురంలో జరిగే షూటింగ్‌తో చిత్రం పూర్తవుతుందని చిన్నపరెడ్డి చెప్పారు.

## రెడ్డి చెల్లెలుగా ప్రద

ప్రభాకరరెడ్డి చెల్లెలుగా జయప్రద నటించే యీ చిత్రంలో రంగనాథ్, అల్లు రామలింగయ్య, నాగభూషణం, త్యాగరాజు, మాడా, రమాప్రభ, జ్యోతిలక్ష్మి, విజయభాను ముఖ్య తారాగణం.

పి. సుబ్రమణ్యం దర్శకత్వంలో తయారయ్యే యీ చిత్రానికి శ్రీకాంత్ మాటలను, సుఖదేవ్ ఛాయను, శీను కూర్పును, కళాధర్ కళను సమకూరుస్తున్నారు.

## వస్తాయి రోజులు

ఉషశ్రీ యెంతగా ఎదిగాడో, పరిస్థితుల ప్రభావంవల్ల అంతగా తరిగాడు. మళ్ళీ యీ చిత్రంతో చిన్నపరెడ్డి దొడ్డమనిషి అవుతాడు. కావాలని ఆశిద్దాం. [34 వ పేజీ చూడండి]



'మనస్సాక్షి'లో షావుకారు జానకి, భారతి

సీరియల్

# డాక్టర్ వనిత

గంటి వెంకటరమణ

*(గత సంచిక తరువాయి)*

కాదంబరి కాస్సేపు అక్కడే నిలుచుని నిట్టూర్చి వెళ్ళిపోయింది. ఆమె యెన్నోసార్లు యింటినుంచి బయలుదేరే సమయంలో అనుకుంటుంది అతన్ని తన గురించిన అభిప్రాయం తెలుసుకోవాలని. తీరా యిక్కడికి వచ్చాక పచ్చివెలక్కాయ గొంతుకో అడ్డుపడ్డట్లు అయేది.

ఆమె తన కోరికను మనసులోనే అదిమి వుంచేసేది. అతను వెళ్ళే రోజు దగ్గరకి వచ్చింది. కాదంబరి అడగనేలేదు. పట్నాయక్ కొడుకుని పిలిచి నెమ్మదిగా తన మనసులో యిన్నాళ్ళూ దోబూచు లాడుతున్న విషయాన్ని బయటపెట్టాడు.

గాంధీ తండ్రివైపు అర్థం కానివాడిలా చూశాడు.

'నేను నెహ్రూజీ, గాంధీజీల కాలంవాడిని. వాళ్ళతోబాటు ఎన్నోసార్లు జైలుకి వెళ్ళాను. నాకీ కులపట్టింపులు అంతగా గిట్టవు. నువ్వు ఎవర్నయినా ప్రేమిస్తే చెప్పు గాంధీ నేనా అమ్మాయిని తీసుకువచ్చి పెళ్ళి చేసే ఏర్పాటు చేస్తాను.'

'నేనెవర్నీ ప్రేమించలేదు బాబూజీ.'

'నీకిప్పుడు వయసెంతో తెలుసా గాంధీ. దగ్గర దగ్గర ముప్ఫై ఏళ్ళు వస్తున్నాయి. యింకా పెళ్ళి చేసుకోకుండా వుంటే నీ వృద్ధాప్యంలో ఎవరు చూస్తారు నిన్ను'

'అదేమిటి బాబూజీ మీ కివాళ కొత్త కొత్త ఆలోచనలు వస్తున్నాయి.'

'నిజం గాంధీ. నాకు యింత కాలం బెంగే లేదు నువ్వు వచ్చాక కొత్త సమస్య ఏర్పడింది. నేను నీ గురించి ఆలోచించని క్షణం లేదు. నువ్వు పెళ్ళి చేసుకోవాలి. రోజూ మనింటికి కాదంబరి వచ్చి వెడుతూంటే అందరూ ఎన్నో ప్రశ్నలు వేస్తున్నారు. చాలామంది డైరక్ట్‌గా అడగనే అడిగారు కాదంబరిని గాంధీ చేసుకుంటాడా అని.'

ఈ మాట వింటూనే గాంధీ విస్తుపోయాడు: 'ఏమిటి మీరంటున్నది. నేను... లేదు... నాక వుద్దేశ్యమే లేదు.'

'అదంతా నాకు తెలియదు. నువ్వా పిల్లకి ఇన్‌డైరెక్ట్‌గా ప్రోత్సాహం యిస్తున్నావు.'

'లేదు... నేను రేపు వెళ్ళిపోతున్నాను కాదంబరిని యింక రావద్దని చెప్పేస్తాను.'

'గాంధీ...' పట్నాయక్ దృఢంగా అన్నారు. ఆ పిల్ల వచ్చిపోవడంవల్ల నాకేం నష్టంలేదు. నువ్వేమీ చెప్పొద్దు నాకు నమ్మకంగా వుంది ఆ పిల్ల నీమీద ఆశలు పెట్టుకుందని. నువ్వు వెళ్ళినా ఆమె రాకపోకలకు నాకు అభ్యంతరం లేదు.

'మీ యిష్టం' అన్నాడు గాంధీ. అతని మనసు పూర్తిగా అశాంతికి స్థావరం అయిపోయింది.

ఢిల్లీ వెళ్ళేముందు గాంధీ కాదంబరిని కలుసుకో లేదు. అతను వెళ్ళిపోయాడని తెలిసి ఆమె బాధపడే వుంటుంది బహుశా. గాంధీ యీ మాత్రం ఆలో చించాడు. మూడవ రోజు జమ్మూ సురక్షితంగా చేరుకున్నాడు. అతను గాంధీనగర్‌లో కెప్టెన్ యింట్లో అద్దె యిచ్చి వుంటున్నాడు. కెప్టెన్ డోగిరీ జాతికి చెందినవాడు. అతను రిటైర్ అయి శ్రీనగర్‌లో వుంటున్నాడు. శీతాకాలం మాత్రం జమ్మూలో వుండి వేసవిలో శ్రీనగర్‌లో వుంటాడు. గాంధీ అంటే అతనికి చాలా యిష్టం.

గాంధీ వచ్చే సమయానికి అతను సకుటుం బంగా వచ్చేశాడు. గాంధీకి యిచ్చిన రెండు గదులే కాక మొత్తం అతని ఆధీనంలోనే వుంచాడు. యిప్పుడు గాంధీ తన వాటాలోకి వెళ్ళిపోయాడు. సాయంత్రం కాగానే గోల్ మార్కెట్ వైపు వెళ్ళడం గాంధీకి అలవాటు. గోల్ మార్కెట్ గుండ్రంగా వుండి హోటళ్ళతో, దుకాణాలతో సాయంత్రం అయేసరికి కళకళలాడుతూ దీపావళికి పెట్టిన దీపాల వరుసలా కనిపిస్తుంది. అక్కడే స్వరణ్ థియేటర్ వుంది. గాంధీనగర్ నుంచి బయలుదేరేముందు అప్సరా థియేటర్ కనిపిస్తుంది. గాంధీ ముందు సినిమాకి వెడదాం

కాదంబరి పుస్తకం తీయబోతూంటే క్రిందపడి చప్పుడైంది. ఆ చప్పుడికి ఉలిక్కిపడ్డాడు గాంధీ. 'ఎప్పుడొచ్చావు?' అని అడిగాడు కంగారుని అణచుకుంటూ.

'ఇప్పుడే ... ఐదో పదో నిమిషాలైంది.'

'అప్పటినుంచీ యిక్కడే వున్నావా?''

'ఆఁ!'

'అరెరే నాకు తెలియదే.'

'మీరు పరధ్యానంగా వున్నారు.'

గాంధీ ఆమె మొహంలోకి చూశాడు. ఆమె ప్రశాంతంగా అతనివైపు దృష్టిని పంపిస్తోంది.

'నన్ను పిలవలేదేం?'

'దేనికండి? నాకు పనేమీ లేదు. పుస్తకాలు పెట్టేసి కొత్తవి తీసుకువెళ్ళాలని వచ్చాను.'

'అలాగా! అన్నట్లు చెప్పడం మరిచిపోయాను. నేను రెండు మూడు రోజుల్లో వెళ్ళిపోతాను. ఈసారి లైబ్రరీ గది తాళాలు నువ్వే వుంచుకో.'

'అలాగే.'

'నువ్వీ వూళ్ళో యెన్నాళ్ళుంటావు యింకా?'

'అదేం అలా అడుగుతున్నారు?'

'ఏమీ లేదు. తెలుసుకుందాం అని.'

'ఉద్యోగం వచ్చేవరకూ.'

'అయితే మంచిదే...చూడు.' గాంధీ చూపుడు వ్రేలితో పుస్తకాలనీ చూపిస్తూ చెప్పడం మొదలు పెట్టాడు. 'నువ్వీ పుస్తకాల్ని ప్రాణంకంటే ఎక్కువగా చూసుకోవాలి. నిన్ను నమ్మి యిస్తున్నాను యీ తాళాలు. ఇన్నాళ్ళూ వీటిని చూసేవాళ్ళే లేక పురుగులు కొట్టేశాయి. వారానికో నెలకో ఎండలో ఒకసారి వుంచి తీసేయ్. ఏ పౌడరో చల్లి బీరువాలు శుభ్రంచేయి. ఉప్పువేసి వారం తరువాత దులిపేస్తుండు...'

'అలాగే.'

'నేను యిప్పట్లో రాకపోయినా యీ ఇంటినీ, నా గ్రంథాలయాన్నీ నువ్వే చూస్తుండు.' గాంధీ తడబడ్డాడు. కాదంబరికి అతను చిన్నప్పటినుంచీ పనులు పురమాయించడం అలవాటు. అతనికి యింతవరకూ ఆమెచేత పనులు చేయించుకో కూడదని తోచలేదు. తమ పొలంలో పనిచేసే బుచ్చిరాములుమీద యెంత స్వతంత్రం వుందో అంతకు రెట్టింపు స్వతంత్రం తీసుకున్నాడు అతను.

అతనికి జీవితంలో ఒకరి సహాయం ఎంత అవసరమో మొదటిసారిగా యిప్పుడే గుర్తించాడు.

*జరిగిన కథ–6 :* తల్లి యామినిని చూడ్డానికి ఢిల్లీ నుంచి హైదరాబాద్ వచ్చిన డాక్టర్ వనితకి రైల్లో తారసపడ్డ ఎమ్. కె. గాంధీ తన అందంతో ఆమె హృదయంలో తిష్టవేస్తాడు. తనను ఎంతో ప్రేమగా చూచే మేనమామ భార్య శ్రీదేవి భర్తృ పరిత్యక్త అయిన తన తల్లిపట్ల నిర్దాక్షిణ్యంగా వుండటం బాధిస్తుంది వనితని. శ్రీదేవి నరహరిల రెండో కొడుకు గోకుల్ ఇంజనీర్. తనను పెళ్ళాడమని గోకుల్ అనటంతో గాంధీ గుర్తుకొచ్చి ఎటూ నిర్ణయించుకోలేక పోతుంది వనిత. గతంలో... యామిని కిష్టం లేకపోయినా భగవన్నారాయణరావుతో వివాహం జరిపిస్తాడు తండ్రి వేణుగోపాల్. పాశ్చాత్య నాగరికతపై మోజున్న భర్త కోపతాపాలకి హడలిపోతుంది యామిని. తన మాటే నెగ్గాలనే రావ్ మనస్తత్వానికి ఎదురు తిరగాలనుకుంటుంది యామిని. చదువుకోకపోవటం అనర్హతగా యామినిని వదిలి లండన్ వెళ్ళిన రావ్ అక్కడ మరో పెళ్ళి చేసుకుంటాడు. గోకుల్‌తో పెళ్ళయిన వెంటనే అమెరికా బయల్దేరిన వనిత తండ్రిని కలుసుకోవాలనుకుంటుంది. గాంధీ తండ్రి పట్నాయక్‌గారు రాజకీయవాది. గాంధీతోపాటే పట్నాయక్ ఆదరణలో పెరిగిన హరిజన యువతి కాదంబరికి గాంధీని వివాహమాడాలనుంటుంది. వనితకి వివాహ మయిందని తెలిసిన గాంధీ వ్యాకులత చెందుతాడు.

అనుకున్నాడు. అతను వెంటనే తన మనసు మార్చుకున్నాడు. సినిమాకి వెళ్ళే మూడ్ లేదు. అతనికి కలవరంగా వుంది మనసంతా. అశాంతిగా అతను గోల్ మార్కెట్‌లో తిరుగుతున్నాడు. అతన్ని చాలామంది పలకరించారు. అందరికీ అతను నవ్వుతూ సమాధానాలు యిస్తూ సాగిపోతున్నాడు. టర్నింగ్‌లో గోల్‌గప్పా తయారుచేసే గుప్తా దగ్గర కొద్దిసేపు ఆగి ఆలూ టిక్కీ తిని కడుపు నింపుకున్నాడు. అటుమంచి అతని కాళ్ళు లక్ష్మీ నారాయణ్ మందిర్ వైపు దారితీశాయి. మందిర్‌లో ఏడుగంటలకి ప్రార్థనాగీతం వినిపిస్తోంది. మందిర్‌కి వచ్చిన వాళ్ళందరూ పాడే పాట మైక్‌లో స్పష్టంగా వినిపిస్తోంది. 'జయలక్ష్మీరమణా...స్వామి జయలక్ష్మీ రమణా' అతనూ గొంతు కలిపాడు.

కాస్సేపు ప్రశాంతంగా సాగిపోయింది సమయం. ప్రార్థన అయాక తీర్థం, ప్రసాదం తీసుకుని బయటికి వచ్చేశాడు. ఎనిమిదిగంటలు దాటుతూంటే యింటివైపు దారితీశాడు.

రాత్రి పక్కమీద పడుకున్నాడేగానీ అతనికి నిద్రపట్టలేదు. అతని మనసూ శరీరం యేకమై వనితకోసం ఆక్రోశిస్తోంది. తెలిసి తెలిసి పెళ్ళి చేసుకున్న యువతికోసం బాధపడడం అతనికి ఒకవంక అసహ్యాన్నీ మరోవైపు తనపట్ల తనకే జాలినీ వేస్తోంది. ఒకే ఒక్కసారి చూసిన అతనికి ఆమె ముగ్ధమోహన రూపం అతన్ని మరీ మరీ కలవరపెడుతోంది. అతను కళ్ళు మూసుకున్నా తెరిచినా ఆమె రూపం కళ్ళముందు ఓసారి కనిపించి మరుక్షణం మాయమై అతన్ని తీరని వేదనకి గురిచేస్తోంది.

అతను యూనివర్శిటీకి వెడుతున్నాడు, వస్తున్నాడు. రోజులు గడుస్తూంటే క్రమంగా అలవాటుపడసాగాడు. ఆవేళ అతను ఇంటికి రాగానే పోస్ట్‌లో అతని పేర ఉత్తరం వచ్చింది. అతను ఆశ్చర్యంగా చూశాడు. ఆ వుత్తరం కాదంబరి వ్రాసింది.

ఉత్తరం చింపి చదువుకున్నాడు. మామూలుగా ప్రారంభించిన ఆ వుత్తరం 'మీ నిర్ణయంమీద నా భవిష్యత్ ఆధారపడివుంది.' అంటూ ముగించింది.

ఆ వుత్తరం చాలాసార్లు చదివాడు అతను. కాదంబరిని పెళ్ళి చేసుకుని స్థిరపడిపోవడంతో తన అధ్యాయం పూర్తయిపోయినట్లేకానీ...కానీ వనిత... అతను యెన్నోసార్లు అనుకున్నాడు.

అతని ఆలోచనలతో సంబంధంలేని చర్య ఏదో కాదంబరికి జవాబు రాసేట్లు చేసింది.

* * *

రెండేళ్ళు గడిచిపోయాయి. వనిత తను చేస్తున్న హాస్పటల్‌కి రెజిగ్నేషన్ లెటర్ పంపింది. ఆ తరువాత గృహిణిగా గోకుల్‌తో అమెరికాలో హాయిగా రోజుల్ని గడిపేయసాగింది. శ్రీరంగకి ఒక్కడే కొడుకు. ఆ తరువాత అందం చెడిపోతుందని మేనక మరి సంతానం విషయం తలపెట్టలేదు. వనితకి యిప్పుడు ఏడాది బాబు. గోకుల్ వెంటనే సంతానమా? అని విసుక్కున్నప్పుడు ఛటుక్కున తండ్రి జ్ఞాపకం వచ్చాడు. గోకుల్‌కి యీ విషయం చెప్పినప్పుడు అతను తేలికగా నవ్వేసి 'భలేదానివే మనమధ్య సంతోషానికి పిల్లలు ఆటంకం అని' అన్నాడు.

'అదేమిటి?' వనిత ఆశ్చర్యంగా అడిగింది.

'కాదామరి. స్త్రీ తను తల్లి అవగానే హాఫ్ ఆఫ్ ది లౌ విల్ గో టు ది చిల్డ్రన్ అని భర్తమీద ప్రేమని పిల్లలకి పంచేస్తుంది.'

'నేనలా పంచనులెండి.'

'అది ప్రకృతి సహజం. ఇవాళ కొత్తగా వచ్చింది కాదు' గోకుల్ నవ్వి వెళ్ళిపోయాడు.

శ్రీరంగ వున్న యింట్లోనే చాలా రోజులు వుండి యిప్పుడు పది మైళ్ళ దూరంలో వుంటున్నారు. వనిత ప్రైవేట్ హాస్పటల్‌లో పని చేస్తోంది. న్యూయార్క్‌లోనే శ్రీరంగ వుంటున్నాడు. గోకుల్ అక్కడికి వెళ్ళాక కారు కొన్నాడు. సామాన్యంగా అందరూ బ్రతికే విధానంలోనే అధునాతనంగా వుంటున్నారు. అప్పుడప్పుడు తెలుగు వాళ్ళు వస్తూంటారు. ఏ రెండు కుటుంబాల వాళ్ళో దగ్గర్లో వున్నారు. మిగిలినవాళ్ళు క్రిస్టియన్స్. అందరూ అక్కడి వాతావరణానికి తగినట్లు అలంకరణలు చేసుకుంటారు. చాలామంది బాబ్డ్ హెయిర్‌లోనే వున్నారు. తెలుగువాళ్ళు గొన్న చేసుకుని వచ్చి స్పష్టమైన యింగ్లీషులో మాట్లాడుతూంటే వనిత తెలుగులోనే సమాధానం యిచ్చేది. గోకుల్ అటువంటి సమయాల్లో చిరాకుగా చూసేవాడు. వనిత భయపడినా నిబ్బరంగా వున్నట్లు నటించేది. చివరకు వుండబట్టలేనివాడిలా అన్నాడు గోకుల్, 'ఏ పద్ధతి నాకేం బాగులేదు వనితా. నువ్వు డాక్టరువి. వాళ్ళంతా యింగ్లీషులో మాట్లాడుతూంటే పెద్ద దేశాభిమానం, భాషాభిమానం నీకే వున్నట్లు నువ్వు యిలా పోజులు కొట్టడం నాకేం బాగులేదు.

వనిత తెల్లబోయింది. "పోజులు కొడుతోందా?" అతనివైపు సూటిగా చూస్తూ



అంది. 'నాకప్పుడు తోచలేదు. కానీ యిప్పుడు మీరన్న తరువాత నిజమే అనిపిస్తోంది. నేను తెలుగు మాట్లాడడంలో మీరు విపరీతార్థాలు తీయనవసరంలేదు. ప్రొద్దున్నుంచీ సాయంత్రం వరకూ మనదికాని భాషలో మాట్లాడుతూ యంత్రంలా బతుకుతున్నాము. చివరికి పిల్లవాడిని నవ్వుతూ నోరారా తృప్తిగా 'ఛీ...ఛీ' అనలేక 'హల్లో' అంటున్నాము అర్థంలేకుండా.'

'ఉన్న దేశంలోనే ఇతర రాష్ట్రాలకి వెళ్లిపోయి అక్కడ ప్రవాసాంధ్రులందరూ కలిసి 'తెలుగు గెట్ టు గెదర్' చేసుకుంటూ తెలుగో రామచంద్రా అంటూంటే యిక్కడ యిన్నిమైళ్ళ దూరంలో నేను తెలుగుకోసం అల్లాడిపోవడంలో తప్పులేదు.'

'మైగాడ్...' గోకుల్ ఆశ్చర్యంగా చూశాడు. 'నేనేదో ఒక్కమాట అంటే నువ్వు యిన్ని అర్థాలు తీశావు...'

వనిత మాట్లాడలేదు. ఆమెకు యీమధ్య ఒక్కసారి తండ్రిని చూడాలన్న కోరిక మరింత యెక్కువగా కలుగుతోంది. గోకుల్ ఒక్కడేకాదు, సామాన్య మానవు లందరిలో నూటికి యిద్దరు ముగ్గురైనా కనీసం అమెరికాకి అలవాటుపడిపోయి స్వదేశాన్ని మరిచిపోతూంటారు. తండ్రి ఆకాలంలో ఆవిధంగా ప్రవర్తిస్తే తప్పేముంది?

అందరూ కూర్చుని డ్రింక్స్ తీసుకుంటున్నారు. దూరంగా కూర్చుంటే గోకుల్ తిడతాడని వాళ్ళల్లో కూర్చుని సాఫ్ట్ డ్రింక్ తీసుకుంది వనిత. మిగిలిన తెలుగువాళ్లు యిద్దరూ లేడీస్ డ్రింక్ తీసుకుంటూ వనితకి ఆఫర్ చేశారు. వనిత నవ్వేసి తిరస్కరించేసింది. గోకుల్ అరమోడ్పు కనులతో గమనిస్తూనేవున్నాడు. పార్టీ ముగిసింది. ఎవరి యిళ్ళకు వాళ్లు వెళ్లిపోయారు. దారిలో గోకుల్ ఆమె వైపు రెండు మూడుసార్లు చురచురా చూశాడు. ఇంటికి వచ్చాక ఆమెతో ఒక్కమాట మాట్లాడకుండా వెళ్లి గదిలో పడుకున్నాడు. వనితకి బెంగగా అనిపించింది. అతను పడుకున్న మంచం దగ్గరకి వెళ్లి అతని క్రాపులోకి వేళ్ళు పోనిచ్చి అతని మొహంలోకి చూస్తూండిపోయింది. అంతటితో ఆమెకి తనమండి దూరమైపోతున్నాడన్న భావన తొలిగిపోలేదు. అతని మొహాన్ని రెండు చేతుల్లోకీ తీసుకుని పెదవులమీద సున్నితంగా ముద్దు పెట్టుకుంది.

అతనికి తెలివి వచ్చింది. చిరాకుగా ఆమెను తోసేశాడు. వనిత ఏడుస్తున్న పిల్లవాడిని సముదాయించేందుకు వెళ్లిపోయింది. ఆమెకి తల్లి జ్ఞాపకం వస్తోంది. ఇండియాకి వెళ్లిపోవాలని పిస్తోంది. తాతగారి ముద్దుమొవుని యెన్నోవిధాల అభినందించుకుంటోంది. తల్లి అవస్థ వేరు తన అవస్థ వేరుగా పరిణమించదుకదా అనుకుంటోంది. ఊయలలో పసివాడిని వూపి వూపి తనూ అలసిపోయి నిద్రపోయింది.

తెల్లవారినా వనిత లేవలేకపోయింది. రాత్రి చాలా ప్రొద్దుపోయేవరకూ నిద్రలేని కారణంవల్ల ఆమెకు తెలివి రాలేదు. అలసిపోయినట్లు చెంపలు లోతుకుపోయి, మొహం పీక్కుపోయింది. గోకుల్ ఆమెవైపు చూశాడు. అతని మనసు పశ్చాత్తాపంతో

# డాక్టర్ వనిత

క్రుంగిపోతోంది. త్రాగనంతవరకూ అతడు చాలా మంచివాడు. ఏమాత్రం త్రాగినా అతని మేధ పని చేయడం మానేసినట్లు అవుతుంది.

ఆమె ముంగురులు సవరిస్తూండిపోయాడు. అప్పటికీ వనితకి తెలివి రాలేదు. అతనే కాఫీ తయారుచేసి తీసుకువచ్చి వనితని లేపాడు. ఆమె వెంటనే తుళ్ళిపడి లేచింది.

'మొహం కడుక్కురా కాఫీ త్రాగుదువుగాని', వనిత రెండు నిమిషాల్లో తిరిగివచ్చి అతని పక్కనే కూర్చుంది. అతని భుజం చుట్టూ చేతులు వేసి కాస్సేపు నిశ్శబ్దంగా కూర్చుండిపోయింది. అతను ఆమె మొహంలోకి చూసి 'నిన్న రాత్రి అమానుషంగా ప్రవర్తించాను క్షమించు' అన్నాడు. వనిత నవ్వేసి 'క్షమించు అనద్దు ప్లీజ్! నాదో చిన్న కోరిక?' అంది.

'ఏమిటది?'

'మనం ఇండియా వెళ్లిపోదాం.'

గోకుల్ ఆమెవైపు విచిత్రంగా చూశాడు. రెండు మూడు నిమిషాల తరువాత నెమ్మదిగా




అన్నాడు. 'నీకు తెలుసో తెలియదో అన్నయ్యకి ఎన్ని వుత్తరాలు వస్తాయో చూస్తే ఆశ్చర్యపోతావు. రోజుకి కనీసం ఒక వుత్తరం అయినా వస్తుంది తమని పిలిపించుకోమని. అవకాశం వుండి మనం వొద్దనుకుంటున్నాం. లేక వాళ్ళు బాధపడుతున్నారు.'

'మీకు యిక్కడే వుండాలని వుందా.'

'అవును... ఏం.'

'మన యింటికి పోదాం.'

'మన ఇండియాలో ఏముంది? పేదరికం, అప్పులూ మనిషి కనీస అవసరాలు తీర్చుకునేందుకు సరిపోని హీన బ్రతుకులూ... యిక్కడ డబ్బు సుఖం... వీటిని వొదులుకునే పిచ్చివాడు వుండడు.'

'మీరు ఎక్కడో వుదాహరణకి తీసుకోకండి. ప్రతి మనిషీ పేదరికంతో ఆకలి చావులు చావడం లేదక్కడ. డబ్బు శాశ్వతం కాదు. ఈ యాంత్రిక జీవితానికి నాకు విసుగు వస్తోంది. మనకున్న ప్రేమలూ బంధాలూ వీళ్ళకు లేవు. ఈ నీళ్ళు త్రాగితే రేపు మన పిల్లడుకూడా తల్లీ తండ్రీని 'హలో' అంటూ పలకరించేందుకు వస్తాడు. ప్లీజ్ మనం వెళ్లిపోదాం.'

'వనితా' గోకుల్ పిలవడం గట్టిగా పిలిచాడు. ఆ తరువాత గంభీరంగా అన్నాడు. 'నీకంత వెళ్లాలని ముచ్చటగా వుంటే నువ్వు వెళ్ళు నా కభ్యంతరం లేదు.'

అతనివైపు చేష్టలు దక్కినదానిలా చూస్తూండిపోయింది వనిత... అతని భుజాల్ని పట్టి కుదుపుతూ 'మీకేం మాట్లాడుతున్నారు? నేను వెళ్లిపోయినా మీకు పరవాలేదన్నమాట. నాతో ప్రమేయం లేకుండా యిక్కడ సుఖంగా వుండగలరన్నట్లేనా? చెప్పండి మీకు అమెరికా కన్నా ఎక్కువైందీ ప్రపంచంలో లేదని' అంది.

'క్షమించు వనితా చిన్నప్పటిమంచీ నేను కన్న కలలు వేరు. అవి యిప్పుడు యదార్థంలోకి వచ్చాయి. బతికే నాలుగు రోజులూ సుఖంగా సంతోషంగా దర్జాగా గడిపేయాలి. అప్పులూ, చికాకులూ, డబ్బు సమస్యలూ యివంటే బొత్తిగా గిట్టవు. ఒక యింట్లో వున్నా మనం ఒక్కనాడూ యీ విషయం తర్కించకపోవడం మనం చేసిన పెద్ద పొరపాటు.'

వనిత చిన్నగా నవ్వింది. ఏడవలేక నవ్వినట్లు జీవం లేనట్లే వుందా నవ్వు. 'పోనీలెండి. మీరు వెళ్లిపొమ్మంటే నేనంత తేలికగా వెళ్లిపోగలనా? నాకు మూఢనమ్మకాలో మరేమో అవి కొద్దిగా పట్టించుకోవాలని వుంటుంది. మీరు వెళ్లమని తేలికగా అన్నారు. కానీ నేను వెళ్లలేను.'

'నాతో అడ్జెస్ట్ కాగలవా?'

'ప్రయత్నం చేస్తాను.'

'ఒకవేళ నీ ప్రయత్నంలో వోడిపోతే?'

'అబ్బ ఎందుకు ప్రొద్దున్నే అటువంటి మాటలు. మనం వంట చేసుకుందాం. పదండి వంటింట్లో మీరు కూర్చుంటే రెండు నిమిషాల్లో పూర్తిచేస్తాను.'

గోకుల్ ఆమె వెనుకే వెళ్లాడు. వనిత వంట చేస్తోంది. అతనితో కులాసాగా కబుర్లు చెబుతోంది. ఉల్లాసంగా వున్నట్లు అభినయం చేస్తోంది. కానీ ఆమె అంతరంగంలో ఏమూలో అశాంతి స్థావరం చేసుకుంది. గోకుల్ అందంగా దృఢంగా యిక్కడికి వచ్చాక మరీ బాగున్నాడు. అతని అంతరంగంలో ఏ మూలా దయాదాక్షిణ్యాలు వున్నట్లు కనిపించడం లేదు. తామరాకుమీద నీటిబొట్టులా వుంది అతని స్వభావం. పిల్లవాడు లేచి ఏడుస్తూంటే అతను తాపీగా కూర్చునేవున్నాడు. వనిత చేస్తున్న పని ఆపేసి పరుగులాంటి నడకతో బాబుని చేరుకుంది.

పిల్లవాడు ఏడుపు ఆపడంలేదు. అంతకంతకు ఏడుస్తూనే వున్నాడు. కడుపునొప్పితో బాధపడే పిల్లవాడికి మందువేసి భుజంమీద వేసుకుని వాడు నిద్రపోయే వరకూ పచార్లు చేస్తూనేవుంది. కొద్దిసేపట్లోనే నిద్రపట్టేసింది వాడికి. అదృష్టవశాత్తు ఏడిపించలేదు మరికొంచెంసేపు అనుకుంది.

గోకుల్ వంట యింట్లో వెలుగుతున్న స్టౌలు ఆర్పేసి వెళ్లి హాయిగా పడుకున్నాడు. తొమ్మిదీ పది గంటలకే అతను నిద్రపోవడం వనితకు బాధ అనిపించింది. కొద్దిసేపు అక్కడే వుండివుంటే అనుకుంది. వంట అయేసరికి చాలా ప్రొద్దుపోయింది. పన్నెండు గంటలకి ఆకలి లేదంటూ అలిగి పడుకున్నాడు. అతని అర్థంలేని అలకని వనిత సాగదీసి తీర్చాలని ప్రయత్నం చేయలేకపోయింది. ఈ విషయాలన్నీ తాతగారికీ అత్తమామలకీ రాద్దామనుకుంటూ 'గుండె పగిలిపోతుందేమో తాతగారికి' అని తనే గుండె రాయి చేసుకుంది.

[ ఇంకా వుంది ]

# సింథాల్ టాయిలెట్ పౌడర్
# తాజాగావుంచే ఒక విశిష్టమైన ఫార్ములా తో

చెమట దుర్గంధాన్ని శక్తివంతంగా
అరికడుతుంది...రోజంతా
మీకు పూల తోట వంటి
తాజాదనాన్ని ఇస్తుంది.




**సింథాల్-ఇండియాలోని ఒకేఒక చర్మదుర్గంధ నివారిణి టాల్క్**

Interpub/CTP/4/76 R TEL.

'రాజా'లో శోభన్‌బాబు

## శివాజీ ప్రారంభించిన కృష్ణ చిత్రం

అక్టోబర్ యిరవై అయిదున కృష్ణ నటిస్తున్న కొత్త కలర్ చిత్రం ప్రారంభమైంది. "నడిగర్ తిలగం" ప్రారంభించారు, శాశి రోజు షూటింగును. ఆ రోజు "ఊర్వశి" పాల్గొన్న సన్నివేశాన్ని, వసూళ్ల దర్శకుడు, బాపయ్య చిత్రీకరించారు.

ప్రముఖ రాజకీయ నాయకుడు, తెనాలిలో "బిగ్‌షాట్" అయిన నన్నపనేని వెంకట్రావుగారు ముఖ్య అతిధిగా పాల్గొన్నారు.

# సినిమా

(29వ పేజీ తరువాయి)

## తారా తోరణం!

హీరో కృష్ణ కధానాయకుడుగా, "ఊర్వశి" శారద చిత్ర నాయికగా నటిస్తున్న ఉదయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్‌వారి వర్ణ చిత్రంలో వెండితెర ప్రముఖులు ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు.

శ్రీయుతులు గుమ్మడి, ప్రభాకరరెడ్డి, గిరిబాబు, నాగేష్, శరత్‌బాబు, సారధి, కాంచన, జయమాలిని గాక మరో ముగ్గురు ముఖ్యులు అతిధులుగా అగుపిస్తారు.

మొదటి షెడ్యూలు పది రోజులు... తరువాతి షెడ్యూలు వారం రోజులు జరిపేవిధంగా షూటింగు "ప్లాన్" చేశారు, నిర్మాతలు సుబ్బానాయుడు, సుధాకర్‌గార్లు.

కధలో కొత్తదనం, కధనంలో చైతన్యం వున్న యీ కొత్త తరహా చిత్రానికి మోదుకూరి జాన్సన్ రచనన్ను, మహదేవన్ సంగీతాన్ని, భాస్కరరావు ఛాయాగ్రహణాన్ని, రామలింగం శిల్పాన్ని, మస్తాన్‌రావు సహదర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు. బాపయ్య చేపట్టిన మరొక కమర్షియల్ చిత్రం యిది.

## చేగొండి, చెలసాని చిత్రానికి "జ్యోతి"

"బంగారు తల్లి" నిర్మాతల్లో ఒకరయిన చేగొండి హరిబాబు, "కృష్ణవేణి" నిర్మాతల్లో ఒకరైన చెలసాని గోపి కలిసి గోపీకృష్ణ క్రియేషన్స్ అనేడి నూతన చిత్ర నిర్మాణ సంస్థను స్థాపించారు. శోభన్‌బాబునుతమ చిత్రనాయకుడుగాఎంపికచేశారు.

వచ్చే ఏడు జూన్ నుంచి షూటింగు ప్రారంభమయ్యే ఈస్ట్‌మన్ కలర్ చిత్రానికి "జ్యోతి" ఫేమ్ రాఘవేంద్రరావు దర్శకుడు.

— శ్రీనివాస్ ●

'సీతారామ వనవాసం'లో ఒక దృశ్యం



తన గుండెలో గుడిగంటలు మోగినట్లుం టుంది.

అందుకే - సీతంటే పడి చచ్చేవాడు తను!

సీత కారణంగానే లారీ కింద పడి చావా లనుకున్నాడు.

కానీ చావకుండా బ్రతికిపోయాడు.

అదే చచ్చే చావయిందిప్పుడు —

అసలు సీత పరిచయం కాకుండావున్నా బాగుండిపోను.

ఈ చావు బ్రతుకుల సమస్యే వుండేది కాదు!

* * *

తన ప్రాణమిత్రుడు పావనమూర్తి పెళ్ళికి పాలకొల్లు వెళ్ళినప్పుడు అక్కడ పెళ్ళిలో పరిచయమైన సీతతో యింతటి గాఢమైన స్నేహం ఏర్పడుతుందని సుబ్బారావు ఊహించ లేదు.

"ఓహ్! సుబ్బారావ్‌గారూ ... మీరు చాలా విట్టీగా మాట్లాడుతారే!" అని సీత తనను మెచ్చుకున్నప్పుడు ఈ లోకాన్నే మరిచి పోయే వాడు సుబ్బారావు.

"ఐ లైక్ యూ వెరీమచ్ .. మిమ్మల్ని, మీ మాటల్ని ఎన్నటికీ మరిచిపోలేను సుమండీ" అని సీత అభినందించిన రోజు రాత్రిమాత్రం నిద్ర పట్టేదికాదు — సుబ్బారావుకి.

ఊహల్లో తేలిపోయేవాడు. కలలు కనే వాడు. ఆ కలలు నిజమైనట్లు మళ్లీ కలలు కనేవాడు. సీతని చూడనిరోజు. ఆమె పేరుని తలవనిరోజు సుబ్బారావుకి జీవితం వ్యర్థం అనిపించేది.

సీతని, తనని అన్ని కోణాలనుంచి పోల్చి చూసుకున్నాడు. ఫరవాలేదు. ఇద్దరికీ ఈడూ జోడూ బాగుంటుంది. ఆమెతో తను ఏ విషయంలోనూ తీసిపోడు. చివరికి సుబ్బారావు ఓ నిర్ణయానికొచ్చాడు. తన మనసులో మాటల్ని సీత హృదయ ప్రాంగ ణంలో నిల్చిపోయేలా వెల్లడించాలనుకున్నాడు.

కానీ — అప్పటికే చాలా ఆలస్యం అయి పోయింది.

సుబ్బారావు ప్రేమైక హృదయ 'ఫటాల్న' పేలింది.

తన సర్వస్వం — తన ప్రాణం — తన జీవితం — అనుకున్న సీత నవ్వుతూ, ముత్యాలు వొలకబోస్తూ సూరిబాబుతో మాట్లాడు తుంది—

## కిటికీ కావాక్షి

(18వ పేజీ తరువాయి)

వాడు — ఆ రోగ్ — ఆ వెధవ — వేసిన 'విట్టు'కి విరగబడి నవ్వుతుంది.

ఏమిటీ మార్పు? ఏమిటీ విపరీత పరి ణామం??

అన్నివైపుల నించి సుబ్బారావుకి వచ్చిన సమాధానం.

డబ్బు! డబ్బు!! డబ్బు!!!

ఔను—సీత డబ్బుగల సూరిబాబు వలలో పడిపోయింది.

అతని హోదా ఆమె హృదయా న్నాకట్టు కుంది.

అతని అంతస్తు ఆమెలో వింత అను భూతులు రగిల్చింది!

'బంగారు పిచిక'ని తనదిగా చేసుకోవాలని దురాశకు లొంగిపోయి యిలా మారిపోయుం టుంది సీత' అనుకున్నాడు పూర్‌ఫెలో సుబ్బారావు

సుబ్బారావు పిడికిళ్ళు బిగించాడు.

తన నిర్మల ప్రేమకు డబ్బు అనే 'స్పెషల్ క్వాలిఫికేషన్' తో అడ్డుపడిన సూరిబాబుని చితక్కొట్టి చెంచాతో నంజుకు తినేయాలను కున్నాడు.

కాని సూరిబాబు డబ్బులోనే గాక జబ్బ ల్లోనూ బలమైనవాడే!

అందంలోను, హోదాలోను. తెలివితేట ల్లోనూ తనకంటే అధికుడు'

మనస్సు వాడి ఆధిక్యాన్ని అంగీకరించలేక పోతోంది.

వాడిలో ఏదో ఓ లోపం కోసం శతవిధాలా పోరి అలసిపోయింది.

తన బలహీనత్వాన్ని, అనాకారి తనాన్ని నిందించుకున్నాడు సుబ్బారావు.

సీత తప్పేంలేదు!

ఏం చూసి తనను ప్రేమిస్తుంది?

కానీ — ఆ సూరిబాబును తల్చుకుంటే అతనిలో ప్రతి అణువు మండిపోతుంది. కుత కుతలాడి పోతోంది.

"ఏం చేయాలి? ఏం చేయాలి?"

ఏమీ తోచక జుట్టు పీక్కున్నాడు పిచ్చాడిలా.

లోకంమీద కక్ష.

డబ్బుగలవాళ్ళ మీద కసి.

అందంగావున్న వాళ్ల మీద అసహ్యం.

శరీరాన్నంతటినీ దహించటం మొద లెట్టింది

సీతను సూరిబాబు పెళ్ళి చేసుకుంటున్నా డని వినగానే సుబ్బారావు గుండెను ఎవరో బలవంతాన పిండినట్లయింది.

కాలు గాలిన పిల్లిలాగ ఆ రోజంతా తిరిగాడు

ఎవర్ని చూసినా సీతా సూరిబాబుల్లా కనపడ్డారు.

ఏదో, ఒకటి చేయాలి.

ఏం చేయాలి? ఏం చేయాలి??

"సుబ్బారావ్! నీ వింత గఢంగా నన్ను



అనుకునేలా చేయ్యాలి. ఏం చేయాలో ఎంత ఆలోచించినా తట్టలేదు.

ఆ సూరిబాబును హత్య చేస్తే! 'అమ్మో! యింకేమైనా వుంది...జైలు...పోలీసులు ... లాఠీదెబ్బలు! ఇహ ఆలోచనలు ముందుకు సాగలేదు ఒక్కసారిగా తనకేదైనా లాటరీ తగిలి లక్షాధికారి అయితే...

"సుబ్బారావూ! నాకు నువ్వే కావాలి!" అంటూ సీత పరుగెత్తుకుని రాదూ! అప్పుడు చూడాలి ఆ సూరిబాబుగాడి ముఖం

ఏవేవో ఆలోచనలు ఏ పనీ చేయటానికి తోచటంలేదు తిండి తిప్పలు లేకుండా కాళ్ళరిగేట్టు తిరిగాడు. ఏదో ఒకటి చేయాలి. అప్పుడు తన్నందరూ గుర్తిస్తారు తన ప్రేమ చిరస్థాయి అవుతుంది. సీత తన కోసం కుమిలి కుమిలి ప్రాణం త్యజిస్తుంది.

అదివాలు తన బతుక్కి!

సుబ్బారావు ఆలోచనలు - పగ్గాల్లేని గుర్రాల్లా పరుగెడుతున్నాయి.

సీతా సూరిబాబుల పెళ్ళి రానేవచ్చింది.

ఇద్దరూ చేతులు పుచ్చుకుని హుషారుగా కేరింతలు కొడుతూ వచ్చి తనకు వెడ్డింగ్ కార్డు యిచ్చి పెళ్ళికి రమ్మని మరీ మరీ చెప్పారు.

ఆ రోజు మనసు చెదిరిన సుబ్బారావు ఏకాంతంగా కృష్ణానది ఒడ్డున గడిపాడు. ఈపాటికి పెళ్ళి అయిపోయి వుంటుంది!

సినిమాల్లో జరిగినట్లు ఏ అవాంతరమైనా అడ్డువచ్చి పెళ్ళి ఆగిపోయి, సీత తన దగ్గరకు వచ్చి "సుబ్బారావూ! నేను మోసపోయాను. నన్ను క్షమించు!" అంటూ తన వొళ్ళో వాలిపోతే ఎంత బావుండెంత బావుండు!

కాని - అలా జరగలేదు. పెళ్ళి జరిగిపోయింది.

ఇహ తన బతుకు వృధా! వృధా!!

తను బలవంతంగా చస్తే అప్పుడన్నా ఈ లోకం గుర్తిస్తుంది.

కాని - చావటమే !!!

తప్పదు చావాలి. నాకు మరణమే శరణ్యము!

ఎలా? ఎలా?? ఎలా???

రోడ్డుమీద పోతున్న లారీ క్రిందకు దూరిపోతే .. నిజంగానే రోడ్డుమీద ఓ లారీ చాలా వేగంగా దూసుకొస్తోంది.

సుబ్బారావు గుండె చేతో పట్టుకున్నాడు. రోడ్డుమధ్యకు చేరుకున్నాడు. శరీరమంతా చల్లబడినట్లనిపించింది.

అప్పుడే తన కళ్ళెదుట తన శరీరపు మాంసపుముద్ద చిక్కటి రక్తం చిమ్ముతూ భయంకరంగా కనిపించింది.

వణుకుతూన్న కాళ్ళను అణచిపెట్టి నిలబడ్డాడు.

లారీ అంతకంతకు దగ్గరకు వచ్చేసింది. భయం గుండెలోనుండి దూసుకుని గొంతులోకి వచ్చేసింది.

గుండెల్లో ఏదో అర్థంకాని ఘోష!

మెదడులో గజిబిజి శబ్దాల హోరు !!

'అమ్మో! చావు ... భయంకరమైన చావు'

తను చావకూడదు... చావరాదు!

సీత లేకపోతే సీత యింకొకతె - బతికుంటే యిలాంటి సీతల్ని ఎందర్నో చూడొచ్చు.

లోకం తన్ను గుర్తించకపోతే మానే - ప్రాణం! తన విలువైన ప్రాణం నిలిస్తే

డు.

చాలు! చాలు!! చాలు!!!

ఎగిరి ప్రక్కకు గంతేశాడు!

హమ్మయ్య!!

క్షణంలో లారీ ప్రక్కనుండి దూసుకుపోయింది.

కాని - వెనుకగా ఏదో చప్పుడు

కారు హారన్ ధ్వని!

తన మీదేదోపడి బరబరా యీడ్చుకుపోతోంది.

జనంగోల... కేకలు... గందరగోళం ... కోలాహలం... తనకేం జరుగుతుందో తెలీడంలేదు సుబ్బారావుకి. మెదడు గడ్డ కట్టేసింది. సముద్రంలోని కెరటం బలంగా లాక్కెళుతున్నట్లుంది. ఊపిరి సలపటంలేదు ఏమవుతోంది? ఏమవుతోంది?? ఏమీ తెలిటంలేదు సుబ్బారావుకి అంతే.

*  *  *

పెద్ద గావుకేకకి కళ్ళు తెరిచాడు సుబ్బారావు ఎదుటి బెడ్ మీద వున్న వంకీలజుట్టు చలపతిని ఇద్దరు నర్సులు బలంగా పట్టుకున్నారు. చలపతి పెనుగులాడుతున్నాడు.

"వద్దు...వద్దు...నాకొద్దు" గావుకేకలు వేస్తున్నాడు గట్టిగా పట్టుకుని డాక్టర్ యింజక్షన్ చేశాడు. బలవంతంగా చలపతి నోరు విడదీసి ఏదో మందు నోట్లో పోశాడు. చలపతి పెనుగులాట మానేసి నోరు చప్పరిస్తూ నవ్వుతున్నాడు.

"సిల్లీఫెలో" అని చిన్నగా నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు డాక్టర్.

"నర్సు చేదు మందు మార్చేసి యింత తీయని మందు యిస్తున్నారని ముందే చెపితే మిమ్మల్ని యింత ఇబ్బంది పెట్టేవాణ్నే కాదుగా!" అన్నాడు చలపతి తనలో తను నవ్వుకుంటూ

"ఈ వేషేమైనా కొత్త గనకనా...మీ కిది మామూలేగా..." దీర్ఘంతీస్తూ వెళ్ళిపోయింది నర్సు.

సుబ్బారావుకిదేం అర్థంగాక అయోమయంగా చూస్తున్నాడు. చలపతి ఒక్క గంతులో సుబ్బారావు పక్కకొచ్చి కూర్చున్నాడు.

"ఏమిటలా చిత్రంగా చూస్తున్నారు?" చనువుగా అన్నాడు చలపతి.

"మందు తీసుకోవటానికి నీవలా గొడవ చేసేస్తుంటేనూ..."

**ఒక్క నెలలో రు.20 లక్షల దొంగ రవాణా సరుకు**

కలకత్తా కస్టమ్స్ అధికారులు 1976 ఆగస్టు మాసంలో మొత్తం రు. 20 68 లక్షలు విలువ చేసే దొంగ రవాణా సరుకులను స్వాధీనం చేసుకున్నారు.

స్వాధీనం చేసుకున్న సరుకులలో రు. 38. 438 విలువచేసే బంగారం రు. 27,000 విలువచేసే వజ్రాలు, రు. 3. 12 లక్షలు విలువచేసే చేతి గడియారాలు, రు. 1.23 లక్షలు విలువ చేసే వస్త్రాలు, రు.7270/- విలువచేసే మత్తు పానీయాలు రు.1.26 లక్షల ఇండియన్ కరెన్సీ, రు 2.42 లక్షలు విలువచేసే లవంగాలు రు. 10 86 లక్షల విలువచేసే ఇతర సరుకులు వున్నాయి.

అదే మాసంలో దొంగ రవాణాకు పాల్పడుతున్న పది మందిని అరెస్టు చేశారు, నలుగురికి శిక్షలు విధించబడ్డాయి.

నురుగు అమితం
సువాసన అమోఘం
ధర మాత్రం సరసం

రు.1.00
మాత్రమే
(పన్నులు
అదనం)




# టర్కిష్ బాత్

తక్కువ ఖరీదు చేసే,
-ఎక్కువ కాలం మన్నే సబ్బు

గోద్రెజ్
ఉత్పాదన

Interpub/GST/3/76 Tel

## కిటికీ కావూాక్షి

"ఓ...అద!" మాడండి— రోజూ వాళ్ళు మందులివ్వటం మారు మాట్లాడకుండా గుటుక్కున మింగేసి నోరు మూసుకు పడుంటం దీన్లో థ్రిల్ ఏముంటుంది చెప్పండి. మనం పేషెంట్లం. ఆ మందు పుచ్చుకున్న వాడు తర్వాత రోడ్డు మధ్య పడి గొడవ చేస్తాడు. మనం ఈ మందు పుచ్చుకునే ముందు బెడ్‌మీద పడి అల్లరి చేయాలి. హుషారు తెప్పించుకోవాలి. అంతేగాని మనం మమ్మీల్లా మంచం మీద ముడుచుకుని పడుకుంటే జబ్బు తగ్గదు, సరికదా దానికితోడు మరోజబ్బు నీరసం పెరుగుతుంది."

సుబ్బారావు చలపతి చెప్పేది ఉత్సాహంగా వింటున్నాడు, చాలా సరదాగా వుంది. ఇంకా వినాలనిపిస్తోంది.

"...మరో రహస్యం ఏమిటో తెలుసా?... వాళ్ళు మందివ్వగానే మనం బుద్ధిమంతుల్లా పుచ్చేసుకున్నామనుకో...అప్పుడు వాళ్ళకి కష్టమంటే ఏమిటో తెలీదు. సోమరితనం పెరిగిపోతుంది. హాయిగా నిద్రరోయి, ఆ మొహాలతోనే మనకి మందులివ్వడానికొస్తారు. మనంగాని యిలా బెట్టుచేస్తూ హడావుడి చేశామంటే వాళ్ళు యీ గొడవంతా భరించటానికి ముందుగానే 'ప్రిపేర్' అయి వళ్ళు దగ్గరుంచుకుని వస్తారు — అలా అని వాళ్ళ సహనాన్ని చివరివరకు పరీక్షించకూడదు. ఏదో ఓ నిముషం... ఎంజాయ్‌మెంటు. వాళ్ళకీ మనకీ సరదా..." చెపుతూ నవ్వుతున్నాడు చలపతి

సుబ్బారావుకి ఆపుకోలేనంత నవ్వు వచ్చింది.

"భలే చతురుడివే!"

• • •

రెండు రోజులు గడిచాయి. పోలీసులు వచ్చి యాక్సిడెంటుకు గల కారణాలు రాసుకుని వెళ్ళారు.

టాక్సీ డ్రైవరుదేం తప్పులేదని స్టేట్‌మెంట్ యిచ్చాడు సుబ్బారావు.

సుబ్బారావు ఇప్పుడు తల కొద్దిగా ప్రక్కకి తిప్పగలుగుతున్నాడు.

ఈ రెండు రోజుల్లోను చలపతి చాలా సార్లు వచ్చి సుబ్బారావును పలకరించాడు. ఎన్నో కబుర్లు, ఎన్నెన్నో తమాషాలు చెప్పి నవ్వించాడు.

అతన్ని చూస్తుంటే సుబ్బారావుకి చిత్రంగా వుంది.

జబ్బేమిటో తెలీదు. మనిషి మంచి ఆరోగ్యంగానే వున్నాడు.

ఎప్పుడూ చిరునవ్వుతో కళ కళలాడు తుంటాడు.

అతనికోసం ఈ రెండ్రోజుల్లోనూ ఎవరూ వచ్చినట్లు లేదు.

'తనకిలాగానే చలపతికి కూడా ఎవరూ లేరేమో !' అనుకున్నాడు సుబ్బారావు.

నిజమేనట –

చలపతికి ఎవరూలేరు. రెండు నెలల్నుంచి గుండెజబ్బుతో హాస్పిటల్లో వుంటున్నాడు.

మనిషి చలాకీగా వుండి తను నవ్వుతూ ఎదుటివారిని నవ్విస్తూ వుంటాడు. సుబ్బారావుకి చలపతికి మంచి స్నేహం కుదిరింది.

సుబ్బారావు కథంతా విని చలపతి జాలి పడ్డాడు.

సానుభూతి చూపాడు. ఓదార్చాడు. ధైర్యం చెప్పాడు.

మనిషైనవాడు ఎప్పుడూ నిరాశతో కృంగిపోకూడదని, ఆత్మహత్య చేసుకోవటం పిరికితనమని, జీవితాన్ని ధైర్యంగా ఎదిరించాలని బోధించాడు.

సుబ్బారావుకు యిక చలపతితోనే కాల క్షేపం.

అతని మాటలు వింటుంటే ఏదో ధైర్యం ఏమిటో ఆశ !

తెల్లవారిందగ్గర్నుంచి రాత్రి నిద్రపోయే వరకు అతని కబుర్లే !

సుబ్బారావు తన బాధంతా మరిచి తృప్తిగా హుషారుగా వుండగలుగుతున్నాడు.

చలపతి దినచర్యలో ఒక ప్రత్యేక కార్యక్రమం వుంది.

సుబ్బారావుకి చాలా ఉత్సాహాన్ని కలిగించే అంశం అది.

తన వెనుకవున్న కిటికీలో చూస్తూ, అవతల జరిగే విషయాలన్నీ పూసగుచ్చినట్లు తనతో చలపతి చెప్తూంటే వింటుంటాడు.

అదే సుబ్బారావుకు ఉపశాంతి – మనస్తృప్తి !

చలపతి చూపుల్లోని ఆతృత, నిరీక్షణ చూస్తుంటే విచిత్రంగా వుంటుంది. చూస్తూ చూస్తూనే కళ్లతోనే ఏవో సైగలు చేస్తుంటాడు.

ఒక్కోసారి లేచి మంచంమీద కూర్చుని చేత్తో ఎవరికో 'టాటా' చెప్తుంటాడు.

నవ్వుతాడు...కళ్లతో మాట్లాడతాడు. చెయ్యూపుతాడు.

ఏమిటేమిటో ఎవరికో చెప్పాలని తాపత్రయ పడుతున్నట్లు కనిపిస్తాడు.

చలపతి చేష్టలు సుబ్బారావుకి చిక్కు ప్రశ్నలా తోచాయి.

రోజు రోజుకీ సుబ్బారావులో ఉత్సుకత పెరగసాగింది.

తను కనీసం వెనుదిరిగి చూడలేడు. శరీరం తన స్వాధీనంలో లేదు. చలపతిని అడుగుదామంటే సభ్యతగా వుండదేమో! ఇహ వుండబట్టలేక ఓ రోజు అడిగేశాడు. చలపతి బదులుగా ఒక చిరునవ్వు నవ్వేడు. అతని నవ్వులో ఏదో చల్లదనం, తృప్తి, గర్వం గోచరించాయి.

"నేనీ హాస్పిటల్‌కు వచ్చి రెండు నెలలు అయింది" చలపతి చెప్తూంటే సుబ్బారావు అతని ముఖంవైపే చూస్తూ వింటున్నాడు.

"నా గుండెజబ్బు ఏమాత్రం తగ్గలేదు. నన్ను చూసినవాళ్లు నాకు గుండెజబ్బంటే నమ్మరు కూడా! కానీ, ఒక్కోసారి హఠాత్తుగా గుండెనొప్పి వచ్చి మెలికలు తిరిగిపోతాను. కనీసం సహాయానికి డాక్టరును పిలవటానికి కూడా నాకు శక్తి వుండదు. నా అదృష్టం బాగుండి దగ్గర ఎవరైనా ఉంటే డాక్టరును పిలిచి ఇంజక్షను యిస్తే బ్రతుకుతాను. లేదా నా పని అంతటిలో ఆఖరు..."

"ఈ గదిలో నే నొక్కణ్ణే రాత్రింబవళ్లు గడిపేవాడిని. ఇప్పుడు మీరున్న బెడ్ ఖాళీగా వుండేది. నా ఎదురుగావున్న ఆ కిటికీ ఒక్కటే నాకు తోడు...అదే నాకు నీడ... అదే నా ప్రాణం.. అదే నా ఆశ !"

చలపతి ఒక్కక్షణం ఆగి ఊపిరి పీల్చుకున్నాడు.

"నే నిట్లా మాట్లాడుతుంటే బహుశా మీకు ఆశ్చర్యంగా వుండొచ్చు. కిటికీనేమిటా యింతగా పొగుడుతున్నానని మీరనుకోవచ్చు. దానికి కారణం వుంది. అది చెప్పటానికి నేనేమీ సిగ్గుపడను."

"నేనిక్కడికి వచ్చిన రెండవరోజే ననుకుంటాను. ఈ కిటికీ ఎదురుగుండా వున్న డాబా యింట్లో ఒక సుందరి కనబడింది. బహుశా ఆ అమ్మాయి ఏ కాలేజీలోనో చదువుతూ వుంటుందనుకుంటాను. ఉదయం ఎనిమిది గంటలకు చిరునవ్వులతో డాబామీద ప్రత్యక్షమవుతుంది. ఆమె కళ్లల్లోని వెలుగు మోడుబారిన నా ఏకాకి జీవితానికొక మెరుపులా క్షణకాలం మెరుస్తుంది. ఆమె లోనికి వెళ్లగానే తిరిగి ఎప్పుడు కనబడుతుందా అని ఆతృతగా ఎదురు చూస్తుంటాను."

"తిరిగి పది గంటలకి కాలేజీకి వెళ్లటానికి గుమ్మంలో ప్రత్యక్షం అవుతుంది. ఆమె చల్లని చూపులు నామీద ప్రసరించగానే సర్వస్వం మరిచిపోతాను. ఆమె రిక్షాలో






కూర్చుని నాకు వీడ్కోలిస్తుంది. తిరిగి సాయంత్రం ఎప్పుడవుతుందా అని నా నిరీక్షణ.''

ప్రవాహం లాగ చలపతి చెప్తుంటే సుబ్బారావులో ఆసక్తి పెరిగింది. చలపతి తిరిగి ప్రారంభించాడు.

''సాయంత్రం అయిదుకాగానే సుందరి రిక్షాలోంచి దిగగానే నావైపు చిరునవ్వును చిందించి లోపలికి వెళ్ళి, క్షణకాలంలో డాబా మీద సాక్షాత్కరించేది. ఆమె నిర్ణీత కాలానికి కనబడకపోతే నా మనసు నా అదుపులో వుండదు. ఏదో పోగొట్టుకున్నవాడిలా వుంటుంది. ఇదీ నా దినచర్య! ఆ అమ్మాయి పేరేమిటోకూడా నాకు తెలీదు అట్లాగే నేనెవ్వరినో కూడా ఆమెకు తెలీదు. మా హృదయాలకు మా పరిచయం అక్కర్లేదనుకుంటాను. చూపుల బాంధవ్యానికి మనుష్యుల పేర్లతో నిమిత్తం లేదనుకుంటాను అయినా నా మనస్తృప్తికోసం కిటికీలోంచి కనిపిస్తున్న ఆ సుందరికి ముద్దుగా 'కామాక్షి' అని పేరు పెట్టుకున్నాను. ఆ పేరుని నాలో

## కిటికీ కామాక్షి

నేనే పిల్చుకుంటూ వుంటాను.''

కొద్ది నిముషాలు చలపతి ఆపాడు.

అతని ఆత్మసంతృప్తికి, నిస్వార్థ ప్రేమకు సుబ్బారావు ఆశ్చర్యపోయాడు ఇలాంటి బాంధవ్యంకూడా లోకంలో వుండటం సుబ్బారావు మేధస్సుకి అందని విషయం!

చలపతి తిరిగి ప్రారంభించాడు.

''నాలో జరుగుతున్న యీ సంఘర్షణ ఎవరికైనా చెప్పాలని, నా యీ సంతోషాన్ని ఎవరితోనన్నా చెప్పుకొని సంతృప్తి చెందుదామని తలిచాను. మీరు నాకు తోడుగా యిక్కడకు వచ్చారు. కానీ మీ విషాదగాథ విని నా హృదయం చివుక్కుమంది. మీ విషయం తల్చుకుంటే మా మూగ ప్రేమే మంచిదని తోస్తోంది. మీ యీ పరిస్థితి చూస్తుంటే ఒక్కోసారి నాకు ప్రేమమీదే అసహ్యం వేస్తుంటుంది.''

చలపతి ఆగాడు.

సుబ్బారావుకు సీత గుర్తుకొచ్చింది.

'ఈపాటికి సీతా, సూరిబాబులు హనీమూన్‌లో గడుపుతూండవచ్చు. లోకంఅంతా సంతోషంగా, స్వేచ్ఛగా గడుపుతూవుంటే తనొక్కడే దిక్కులేని యీ హాస్పిటల్లో ఏకాకిగా, నా అనే వాళ్ళు లేక...'

ఇహ వూహించుకుంటే సుబ్బారావుకు దుఃఖం ఆగలేదు

తన ప్రక్కన వచ్చి కూర్చుని ''సుబ్బారావుగారూ! మీరు మరీ ఎక్కువగా ఆలోచించి మనసు పాడుచేసుకోకూడదు.'' అని ధైర్యాన్ని కలుగచేస్తున్న చలపతిని చూసి దుఃఖం దిగమింగుకున్నాడు

''మీరు గతం మరిచిపోయి వర్తమానంలోకి రావాలి. గతం గతమే ...'' అంటూ చలపతి తొందరగా అతని బెడ్ మీదికెళ్ళి కూర్చున్నాడు

అంత త్వరగా ఎందుకెళ్ళిపోయాడో సుబ్బారావుకి అర్థంకాలేదు

గోడనున్న గడియారంవైపు చూశాడు. అయిదు గంటలయింది

సుబ్బారావుకి విషయం అర్థమైంది.

చలపతి చూపులు తనపై గా లగ్నమై వున్నాయి అతని కళ్ళు నిశితంగా వేటి కోసమో నిరీక్షిస్తున్నాయి.

సుబ్బారావు కనురెప్పలు వేయకుండా చలపతినే గమనిస్తున్నాడు.

కొన్ని క్షణాలలోనే చలపతి సుబ్బారావు వైపు చూపుల్ని త్రిప్పాడు.

"ఇప్పుడే కామాక్షి కాలేజీ నుంచి వచ్చింది. గాలుజడ వేసుకుని, తెల్లని మల్లెపువ్వులాంటి చీరలో కామాక్షి అప్సరసలా వుంది. ఆమె నవ్వుతుంటే ముత్యాలు రాలుతున్నట్లుంది." చలపతి తన్మయత్వంతో వర్ణిస్తున్నాడు.

సుబ్బారావు చలపతి అదృష్టానికి ముగ్ధుడయ్యాడు.

'తనకా అదృష్టంలేదు. మెలె పువ్వులూ ...తెల్లచీర...సీత కూడా అలాగే తయారవుతుంది. ఆ రూపంలో సీత కనిపిస్తే తను పరవశించిపోయేవాడు. తెల్లచీరలో సీత రతీదేవిలా వుండేది. ఓరోజు సినిమాకి కూడా వెళ్ళారు తామిద్దరు. తాను తెల్లబట్టలే వేశాడు. ఎంత చక్కని జంట అనుకుని వుంటారంతా. కాని, ఆ హాలు దగ్గరే సూరిబాబు శనిగాడిలా తయారై తన ప్లానంతా చెడగొట్టాడు. ఆ సినిమా ఏం బాగోలేదని వెధవ కబుర్లు చెప్పి ఏ.సి. హోటల్ కి వెళ్దామని సీతను మనసు మార్చేశాడు. ఛీ. ఛీ నా ఆలోచనల మధ్య ఆ డర్టీ రాస్కెల్ ఎందుకూ...' అనుకున్నాడు సుబ్బారావు.

తెల్లచీరలో కామాక్షి ఓహ్! సీత లాంటి కామాక్షి, కామాక్షి లాంటి సీత!

తాను కనీసం వెనుదిరిగి చలపతి అదృష్ట దేవతను ఒక్కసారి చూడగలిగితే ఎంత బావుండు

కాని తను అశక్తుడు. ఒక్కసారి చూసే అదృష్టం కూడా లేదు. తనిట్లా కదలకుండా శవంలా పడుకోవటం ఎన్ని రోజులు! తన పరిస్థితిపై తనకే జాలి వేసింది.

సుబ్బారావు ముభావంగా, దిగులుగా వుండటం చూసి చలపతి ఉల్లాసంగా కబుర్లు మొదలు పెట్టాడు.

చలపతితోపాటు సుబ్బారావు కూడా శ్రుతి కలిపి ఆ పూట గడిపేశాడు. ఆ రోజురాత్రి చాలా ప్రొద్దుపోయే వరకు సుబ్బారావు నిద్రపోలేదు. ఏవేవో ఆలోచనలు, పీడకలలు, పిచ్చి కలలు !!

సీతా, సూరిబాబు. చలపతి, కామాక్షి జంటలు జంటలుగా కనిపించారు.

ఉదయం పదిగంటలవుతుంది.

చలపతి చూపులతోనే కిటికీ కామాక్షిని కాలేజీకి పంపించి సుబ్బారావుతో కబుర్లలో పడి చాలాసేపు సుబ్బారావును నవ్వించాడు.

నవ్వుతూ నవ్వుతున్న వాడల్లా చలపతి ఒక్కసారిగా గుండె పట్టుకొని ముందుకు జరిగాడు.

మనిషి మెలికలు తిరిగిపోతున్నాడు

రక్తం అంతా ముఖంలోకి చిమ్ముకొని వచ్చినట్లు ఎర్రబడింది.

గజగజ వణికిపోతూ, గుప్పెట్లో గుండెల్ని అదిమిపట్టుకొని మెలికలు తిరిగిపోతున్నాడు

సుబ్బారావు ఓ నిముషం ఏం చెయ్యటానికి తోచలేదు.

"డాక్టర్! డాక్టర్!" పిచ్చెత్తినట్లు అరిచాడు. అవతలవున్న నర్స్ పరుగున వచ్చింది.

చలపతి పరిస్థితి చూసి అర్జెంటుగా డాక్టర్ని వెంటబెట్టుకొచ్చింది. వెంటనే డాక్టర్ చలపతికి ఇంజక్షన్ యిచ్చాడు. కొన్ని నిముషాల్లో చలపతి తేరుకుని ప్రశాంతంగా నిద్రపోయాడు.

సుబ్బారావుకు యింకా మెలకువ రాలేదు. ఎవరో తట్టి లేపారు. కళ్ళు తెరిచాడు సుబ్బారావు.

చలపతి నవ్వుతూ అభినందనలు చెప్పతున్నాడు. తన ప్రాణం కాపాడినందుకు థాంక్స్ చెప్పాడు ఆ రోజల్లా 'కిటికీ కామాక్షి' కబుర్లతో కాలం గడిచిపోయింది.

★ ★ ★

"సిస్టర్! నాకు ఎంత ఖర్చుపెట్టినా తరగని ఆస్తి వుంది ఓహ్ లిమిట్ లెస్. నేనింతవరకు లెక్కపెట్టలేదు అది ఖర్చుపెట్టేందుకు నాకు ఓపికా లేదు. పంచుకునేందుకు నా వాళ్ళంటూ ఎవరూ లేరు."

చలపతి ప్రవాహంలా చెప్పుకుపోతున్నాడు.

మందివ్వటానికి వచ్చిన నర్స్ తనొచ్చిన పని మర్చిపోయింది.

సుబ్బారావు తనలో నవ్వుకుంటూ చలపతి మాటలు వింటున్నాడు.

"నా తరువాత...అంటే నేను పోయిన తర్వాత నా ఆస్తి ఎవరికివ్వాలి. ధర్మసత్రాల మీద, హాస్పిటళ్ళ మీద, గుళ్ళూ గోపురాల మీద నాకు అట్టే నమ్మకం లేదు. అంతేగాక వాటికి విరాళంగా రాసి నా ఆస్తిని దుర్వినియోగం చేయదల్చలేదు."

ఓసారి చెప్పటం ఆపి నర్స్ని, సుబ్బారావుని మార్చి మార్చి చూసి, ఇద్దరూ ఇంటరెస్ట్గా వింటున్నారని నిర్ణయించుకుని మళ్ళీ మొదలెట్టాడు.

"నా ఆస్తి ఏం చేయదల్చాననికదూ...మీ ప్రశ్న! నాకు ఒకే ఒక మార్గం కనిపిస్తోంది. ఒక పెద్ద ఎడ్వంచర్. నా ఆస్తిని ఎవరికీ యివ్వకుండా నాతోపాటే తీసుకెళ్ళిపోదలిచాను దట్సాల్ రైట్...అంతే...అంతే...!" అన్నాడు చలపతి.

నర్స్కి ఆతృత, ఆశ్చర్యం కలిగాయి.

## మట్టిగోడలు నానిపోకుండా చేయడం

మట్టిగోడలతో ఇళ్ళు కట్టుకునే పద్ధతి మన గ్రామాలలో ఇంకా విస్తృతంగా అనుసరించడం జరుగుతున్నది. వీటిలో కొన్ని ఇళ్లగోడలు వర్షాలకు నాని కూలిపోవడం తరచు సంభవిస్తూనే వుంటుంది ఈ గోడలు వానలకు, నీటికి నానిపోకుండా చెయ్యడానికి ఒక ప్రక్రియను రూపొందించడం జరిగింది. ఇది చౌకగా అనుసరించ దగినది 25 కిలోల తారును కరిగించి 50 లీటర్ల కిరసనాయిల్ లో కలపాలి. ఇది చల్లారాక వడగట్టి మందులు చల్లడానికి ఉపయోగించే స్ప్రే పంపులతో దీనిని మట్టిగోడపై చల్లాలి. ఈ పంపులు ఈ రోజుల్లో పతి పంచాయితీ ఆఫీసులోనూ లభిస్తూనే వుంటాయి. ఒకసారి ఈ ద్రావణాన్ని చల్లి, నాలుగు గంటల తర్వాత మళ్ళీ చల్లాలి. ఈ ద్రావణం చల్లిన గోడలు అరాక బూడిద రంగులో వుంటాయి. కావాలనుకుంటే ఒక కిలో సున్నంలో 75 గ్రాముల సర్ఫ్ను కలిపి ఈ గోడలకు వెల్ల వేసుకుంటే తెల్లగా కనిపిస్తాయి. అనేక ఇళ్ల మట్టిగోడలు బయట భాగాలపై పైన సూచించిన విధంగా ఈ ద్రావణాన్ని ప్రయోగించడం జరిగింది. ఫలితంగా అనేకసార్లు కుంభవృష్టి కురిసినా ఈ గోడలలో ఒక్క చుక్క నీరు కూడా ఇంకలేదు

"ఇంతకూ మీరు చెప్పే ఆస్తి ఎక్కడుంది. ఎంత వుంది. తెల్సుకోవచ్చా?"

'తన మనసులోని ప్రశ్న నర్స్ అడిగేసిందిలే' అనుకున్నాడు సుబ్బారావు.

నర్స్ గౌనుకు తగిలించుకున్న పెన్ అడిగి తీసుకుని ఓ కాయితంమీద ఏదో రాసి నర్స్‌కి అందించాడు.



చదువు!" అన్నాడు.

నర్స్ ఆ కాయితంమీద రాసింది బిగ్గరగా చదివి అదిరిపడింది.

"నా ఆస్తి నా దగ్గరే వుంది. అది నా గుండెజబ్బు. తరగనిది" అని వుంది దాన్లో.

చలపతి సంతోషంగా చప్పట్లు కొట్టి పకపకా నవ్వాడు.

నర్స్‌కి, సుబ్బారావుకి నవ్వాగలేదు. వాళ్ళు శృతి కలిపారు.

"యూ సిల్లీ బోయ్! ఎదుటి వాళ్ళని ఆనందపెట్టడంకోసం కట్టు కథలు చెప్పి నవ్విస్తాడు. కవ్విస్తాడు" అని నవ్వుకుంటూ చకచకా వెళ్ళిపోయింది నర్స్.

చలపతి తన బెడ్‌మీద పడి దొర్లి దొర్లి నవ్వుకున్నాడు.

సుబ్బారావుకి చలపతి చూస్తుంటే చాల ముచ్చటేసింది.

*   *   *

ఇప్పుడు సుబ్బారావు ఒంటరితనం మర్చిపోయాడు.

'కిటికీ కామాక్షి' కబుర్లు వింటూంటే సీత గుర్తుకొస్తోంది. కామాక్షి వర్ణనలు వింటుంటె సుబ్బారావులో ఏదో అవ్యక్తమైన కోరిక పెరగసాగింది.

'ఒక్కసారి కిటికీలోనుండి కామాక్షిని చూడగలిగితే !'

తన ఈ కోరిక ఎవరితో చెప్పుకో గలుగుతాడు ?

ఎంతగా తన కోరికను అణచుకునేకొలది అది అంతగా పెరగసాగింది.

చలపతి అదృష్టవంతుడు.

కాలు కదలకుండానే రోజూ తన అదృష్ట దేవత దర్శనం చేసుకోగలుగుతున్నాడు.

తనకు అలాంటి అదృష్టం లేదు.

కనీసం ఒక్కసారి చూసే భాగ్యమున్నా కలుగదు !

రోజు రోజుకి సుబ్బారావులో కిటికీ కామాక్షిని చూడాలనే కోరిక బలపడసాగింది.

కానీ — తను తల పక్కకు త్రిప్పగల స్థితిలోకూడా లేదు.

కనీసం చలపతి అయినా అడగడే 'కామాక్షిని చూడాలని వుందా?' అని.

సుబ్బారావులో రోజు రోజుకు చిత్రమైన భావాలు రాసాగినై.

యథాలాపంగా రోజులు గడిచిపోతున్నాయి.

ఊహాతీతమైన రంగులు
ఉవ్విళ్ళూరించే డిజైన్లు

# మదురా బట్టలు కనులకు విందు

పోలియెస్టర్ మరియు పోలియెస్టర్ మిశ్రిత
బట్టలలోని విస్తృతశ్రేణి సూటింగులు, షర్టింగులు.

మదురా బట్టలు–తయారు చేయువారు

**మదురా కోట్స్**



డిస్ట్రిబ్యూటర్లు: మధుర సౌత్ ఇండియా కార్పొరేషన్ [ప్రై] లిమిటెడ్ 156, వస్త్రలత, విజయవాడ *** మధుర సౌత్ ఇండియా కార్పొరేషన్ [ప్రై] లిమిటెడ్, 7–3–70, రాష్ట్రపతిరోడ్డు, సికింద్రాబాద్.

M/CL-171 TEL

# కిటికీ కామాక్షి

ఇదివరకు మాట్లాడినంత స్వేచ్ఛగా సుబ్బారావు యిప్పుడు మాట్లాడలేక పోతున్నాడు.

చలపతి మాత్రం తన కామాక్షి కబుర్లతో పొద్దు పుచ్చుతున్నాడు

. సుబ్బారావులో కోరిక క్షణ క్షణానికి బలపడసాగింది. కామాక్షి స్థానంలో సీత వున్నట్లే కనిపిస్తోంది. సీత తనను రమ్మని పిలుస్తోంది. ఏదో రహస్యం చెప్పాలని పిలుస్తోంది. సీతే కామాక్షి. కామాక్షే సీత !!

'తనెట్లా అయినా కామాక్షిని ఒక్కసారి చూడాలి !'

హృదయంలో ఒక అస్పష్టమైన ఊహ మెదిలింది.

బలవంతంగా దాన్ని తన శాయశక్తులా అణచాడు.

కాని, అది తిరిగి హృదయమంతా ఆక్రమించుకోసాగింది.

దానిముందు సుబ్బారావు బలం చాలటం లేదు.

రాత్రంతా సుబ్బారావుకు నిద్రపట్టలేదు సతమతమవుతునె వున్నాడు.

తన కోరిక వెనక దాగివున్న భయంకరమైన నిజాన్ని తల్చుకొని వణికిపోయాడు.

కాని, దానిగురించి ఆలోచించటం మానలేకపోయాడు.

మామూలుగానే ఆ రోజు తెల్లవారింది.

కాని సుబ్బారావు మాత్రం మామూలుగా లేడు.

చలపతి ఎంతగా నవ్వుతూ కబుర్లు చెప్పినా స్వేచ్ఛగా నవ్వలేక పోతున్నాడు.

తన మాలిన్యాన్ని దాచటానికి ప్రయత్నించే కొలది అది అతని ముఖ కవళికల్లో కనపడుతునే వుంది.

డ్యూటీ డాక్టర్ రౌండ్ చేసి వెళ్ళిపోయాడు !

"ఈ రోజు మీ మూడ్ బాగా లేదనుకుంటాను. బహుశా మీకు సీత గుర్తువచ్చి వుంటుంది." అని ప్రశ్నించాడు చలపతి.

సుబ్బారావు చిరునవ్వును బలవంతంగా తెచ్చుకున్నాడు. మాట్లాడుతూనే చలపతి దృష్టి కిటికీవైపు మళ్ళింది. క్షణంలో అతని ముఖంలో సంతృప్తితో కూడిన ఆనందం వెల్లివెరిసింది. సుబ్బారావులో అర్థంకాని బాధ మొదలయింది.

చలపతి మామూలుగా కిటికీ కామాక్షి రూపాన్ని వర్ణిస్తున్నాడు.

"కామాక్షి ఈవేళ చాలా నీట్‌గా తయారయింది. తలకి పోసుకున్నట్లుంది. వదులుగా రెండు జడలు వేసుకుంది చెవికి పైన ఓ ప్రక్కగా తలలో గులాబీ, ఓహ్ గులాబీ శారీ ఎంత నిండుదనాన్నిచ్చింది. ఎంత బాగా నవ్వుతుంది కామాక్షి అంతేకాదు...నాజూగ్గా..."

వర్ణిస్తున్నవాడల్లా చలపతి హఠాత్తుగా ఒక్కసారిగా ఆగిపోయాడు గుండెను పట్టుకుని ముందుకు ఒరిగిపోయాడు. మనిషి కొంకర్లు తిరిగిపోతున్నాడు మళ్ళీ గుండెనొప్పి వచ్చినట్లుంది. చలపతి మెలికలు తిరిగిపోతున్నాడు. ముఖం ఎర్రబడింది. గజగజ వణుకుతున్నాడు అయ్యో, అయ్యయ్యో ఎలా ? గుప్పెడంత గుండెలో ఎంత నొప్పి, ఎంత పోటు! చలపతిని తన బెడ్ మీద బాధలె చుట్టచుట్టుకు పోతున్నాడు జాలితో కూడిన చూపులతో సుబ్బారావువైపు చూస్తున్నాడు. ఆ చూపుల్లో ఎంత శక్తి—

'ఒక్కసారి డాక్టరు కోసం కేకవేయవూ!' అంటున్నట్లున్నాయి.

సుబ్బారావులో చలనంలేదు. చలపతి నురుగులు కక్కుతున్నాడు. సుబ్బారావు తన చూపుల్ని చలపతివైపు నుంచి మరల్చుకున్నాడు. అతనివైపు చూస్తే ఆ దీనహీన స్థితికి తనకు తెలియకుండానే పొరపాటున డాక్టర్‌కోసం కేకలేస్తాదేమోనని భయం ఆవహించింది.

హృదయాన్ని గట్టిగా రాయి. చేసుకుని రెండు నిముషాలు బలంగా కళ్ళు మూసుకున్నాడు.

కాని హృదయంలో ఒకటే ఘోష !

మెదడులో భయంకరమైన పెళపెళలు !!

గుండెల్లో గునపాల పోట్లు !

ఎదుటి బెడ్‌లో ఓ వ్యక్తి ప్రాణం కోసం చివరిసారిగా హోరాహోరీగా యుద్ధం చేస్తున్నాడు.

దాని ఎదుట బెడ్‌లోని ఒక వ్యక్తి మానవత్వానికీ రాక్షసత్వానికీ జరిగే యుద్ధాన్ని తిలకిస్తున్నాడు,

సంఘర్షణ ముగిసింది.

రాక్షసత్వం గెలిచింది.

సుబ్బారావు మెల్లగా కళ్ళు తెరిచాడు.

చలపతి జీవితంతో పోరాడి, అలసి శాశ్వత

విరిగిపోయాడు. అతని కళ్ళు సుబ్బారావునే చూస్తున్నాయి. అతని పెదాల్లో చిరునవ్వు చిందులాడుతూనే వుంది.

సుబ్బారావు చూడలేకపోయాడు. వెన్నులోంచి భయం చిమ్ముకువచ్చింది. ఒక్క గావుకేక పెట్టాడు...కాని—చాలా ఆలస్యంగా-

ప్రక్క వార్డులోవున్న డాక్టర్, నర్స్ సుబ్బారావు కేకవిని పరుగెత్తుకొని వచ్చారు.

సుబ్బారావు గట్టిగా కళ్ళు మూసుకున్నాడు. కానీ. చెవులు వాటిపని చేస్తున్నాయి.

హడావుడిగా డాక్టర్, యింకెవరెవరో అటు యిటు పరుగెత్తారు. చలపతిని పరీక్షించారు పెదవి విరిచారు. చలపతి ఇకలేడు. ప్రాణాలతో పెనుగులాడిన చలపతిలో చలనం లేదు శవంపై గుడ్డ కప్పారు.

"పూర్ ఫెలో! తన ఆస్థిని తనవెంటే పట్టుకుపోయాడు." కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ అంది నర్స్. సుబ్బారావు చలపతి శవాన్ని చూసి దోషిలా వణికిపోయాడు. ఎవరూ తనవైపు పరికించటంలేదు.

ఆ రోజు సాయంత్రం-

చలపతి శవాన్ని బెడ్‌మీదనుంచి తొలగించారు. రూము వెలవెల బోయినట్లుంది. చలపతి పడుకునే బెడ్ తన్నుచూసి పరిహసిస్తున్నట్లనిపించింది సుబ్బారావుకు. దానివైపు చూళ్లేకపోయాడు.

రెండో రోజు—

డాక్టర్ విజిట్‌కు వచ్చి సుబ్బారావును చూసి జాలిపడ్డాడు. "మీరిప్పుడు ఏకాకి అయ్యారు. ఎప్పుడూ సందడిగా వుండే చలపతి లేడు. ఎవరినైనా ఈ రూమ్‌లోనికి మారుస్తాను. మీకు ఒంటరితనం పోతుంది" అన్నాడు డాక్టర్.

డాక్టర్ వెళ్లిపోతున్నాడు. తన మనసులోని కోరిక అతనితో చెప్పాలి...చెప్పాలి...చెప్పాలి... మరో నాలుగడుగుల్లో రూమ్ దాటిపోతాడు. సుబ్బారావు ఆలస్యం చేయకుండా—

"డాక్టర్!" అని పిలిచాడు. డాక్టర్ వెనుదిరిగి వచ్చాడు.

"డాక్టర్! ఓ చిన్న కోరిక!"

ఏమిటన్నట్లు చూశాడు డాక్టర్.

సుబ్బారావు తనకోరిక చెప్పటానికి ఓ నిముషం జంకాడు చివరకు ధైర్యం తెచ్చుకున్నాడు.

"ప్లీజ్ డాక్టర్! నన్ను ఎదుటి బెడ్‌లోనికి మార్చండి!" అన్నాడు.

డాక్టర్ చిత్రంగా సుబ్బారావు వైపు చూశాడు

జాలిగా చూస్తూ సుబ్బారావుపై సానుభూతి చూపాడు.

"చలపతి మీది అభిమానాన్ని చంపుకోలేక పోతున్నారు ఎ పి.టీ యు అలాగే మీ బెడ్ మార్పిసాను" అంటూ నర్సును పిలిచి బెడ్‌ను మార్చమని చెప్పాడు.

సుబ్బారావులో ఉద్విగ్నత పెరిగింది. ఒకవైపు తప్పు చేశాననే బాధ! మరొకవైపు అర్థంకాని ఆనందం!! రకరకాల ఆలోచనలతో ఊపిరాడటంలేదు తనకి. 'కిటికీ కామాక్షి' ని చూడగలడు. ఇక వుండే రోజులు కామాక్షిని చూస్తూ గడపవచ్చు. సీతలాంటి కామాక్షి కామాక్షిలాంటి సీత! సీత లేకపోతే పోయింది




మీరింతవరకూ వివాహం చేసుకోపోవడానికి కారణం ??

నా నటజీవితంలో రెండొందల చిత్రాలలో పెళ్ళి సీన్లలోనూ మొటయాభై శోభనం సీన్లలోనూ నటించి, నటించి, మొహం మొత్తింది !

నా బ్రతుక్కి కామాక్షి చాలు ఓ రకమైన సంతృప్తితో గట్టిగా ఊపిరి పీల్చాడు.

నలుగురు 'వార్డుబాయ్స్' వచ్చారు. తన హృదయంలో అమృతం చల్లటానికి వచ్చిన మూర్తులు! రోజూ తను కామాక్షిని కిటికీ గుండా చూసే అవకాశాన్ని కల్పించేందుకు వచ్చిన అదృష్టదేవతలు!

గడియారం చూసాడు పదినిముషాల తక్కువ పది. వాళ్ళు చలపతి బెడ్‌ను అక్కణ్నుంచి తొలగించారు. తన బెడ్ ఎత్తి అక్కడకు మార్చారు. సుబ్బారావు గుండెల్లో ఏదో ఆతృత, ఏవేవో తెలియరాని అనుభూతులు సందడి చేయసాగాయి. ఒక్క నిముషం కళ్లు మూసుకున్నాడు. మరో మూడు నిముషాలు వుంది.

కామాక్షి సరిగ్గా పదిగంటలకి కాలేజీకి బయలుదేరుతుంది. రిక్షా ఎక్కి కిటికీలోంచి తనవైపు చూసి వీడ్కోలు చెప్తుంది ఆ సుందర విగ్రహాన్ని ఆ చిరునవ్వుల మొలకను తనివితీరా చూడాలి ఇంకొక్క నిమిషం!

వార్డుబోయ్స్, నర్స్ అవతల వార్డులోకి వెళ్ళినట్లు పాదాల సవ్వడి వలన తెలుసుకున్నాడు సుబ్బారావు.

నిమిషం అయిపోయింది ఓ సారి గట్టిగా ఊపిరి పీల్చి కళ్ళు తెరిచాడు ఎదుటి కిటికీ వైపు అంతులేని ఆతృతతో చూశాడు. ఉద్విగ్నతతో చూశాడు, ఉత్సాహంతో చూశాడు.

అంతే —

సుబ్బారావుకు తనున్న రూమ్‌పైన ఫాన్, క్రింద భూమి అంతా గిర గిరా తిరుగుతున్నట్లయింది.

మస్తిష్కం అంతా మొద్దుబారిపోయింది.

ఒక్కసారిగా —

తన శరీరంలోని రక్తమంతా గడ్డ కట్టుకొనిపోయింది.

ఆ రూమ్ కప్పకూలి మీద పడుతున్నట్లు—

పైన వెలిగే ట్యూబులైటు 'ఫటాల్న' పేలిపోయినట్లు -

చచ్చిపోయిన చలపతి 'ప్రేతాత్మ' పగలబడి నవ్వుతున్నట్లు —

భయంకరమైన అనుభూతులు కలిగాయి సుబ్బారావుకి.

తిరిగి కళ్ళు నులుముకుని చూశాడు.

మళ్ళీ మళ్లీ చూశాడు !

ఆశ్చర్యం !

అద్భుతం !!

అక్కడ 'కామాక్షి' లేదు.

అసలు కిటికీ'యే లేదు !

గోడ మామూలుగా తెల్లగా వుంది.

సుబ్బారావును వెక్కిరిస్తోంది.

అతని బ్రెయిన్‌లో గందరగోళంగా —

ఆలోచనల ట్రెయిన్లు పరుగెడుతున్నాయి.

"సిల్లీబోయ్! ఎదుటివాళ్లని ఆనందపెట్టడంకోసం కట్టు కథలు చెప్పి నవ్విస్తాడు. కవ్విసాడు."

ఓసారి చలపతి గురించి నర్స్ అనిన మాటలు సుబ్బారావు చెవుల్లో పదే పదే గింగురుమంటున్నాయి.

మతి చలించినవాడిలా "చలపతీ!" అంటూ పెద్దగా గావుకేక పెట్టి గట్టిగా కళ్ళు మూసుకున్నాడు సుబ్బారావు.

## మనకు క్రీడా 'భంగం' ఎన్నాళ్లు?

ఎందరో యువకుల్ని యువతుల్ని మనం చూస్తూనే వుంటాం... యువతరంతో మాట్లాడటం – వాళ్ల ఫొటోలతో ఆ కబుర్లు రాయడం లాంటివి మిగతా పత్రికలు కూడా మొదలెట్టాయి. కాని సమస్య ఏమిటో అంటే... యువకుడికి తెలిసిన విషయాలమీదే మనం ఆసక్తి చూపించాలి... అవి సినిమాలు తరువాత కో యెజుకేషన్ – అబ్బాయిల్ని అమ్మాయిలు యేడిపిస్తున్నారా? వాళ్ళని వీళ్ళు కవ్విస్తున్నారా?... అసలు యీ రెండు








జాతులు కలసి – వాళ్ల అమ్మా నాన్నల్ని ఎంత యేడిపిస్తున్నారో? వివ్వరూ రాయగేం ... అసలు మీరు "పేరెంట్స్"ని "మినీ యింటర్వ్యూ"లో వేయాలి అన్నాడో పెద్దమనిషి... చేద్దామే, అనుకోండి... కాని మా కుర్రాడంతవాడు యింతవాడు... వాడికి ఫలాని మంత్రిగారు సర్టిఫికేట్ యిచ్చాడు – ఫలానా సినీమా స్టార్తో పరిచయముంది – మావాడు కథలు రాస్తాడు, గేయాలు గీస్తాడు, బొమ్మలుకూడా వేస్తాడు. మా వాణ్ని ఎంకరేజ్ చేయాలి... అంటారేతప్ప– అలాగే మా అమ్మాయి పాటలు వింటుంది ఫ్యాషన్లు లెక్ చేస్తుంది, టైపు, షార్ట్ హాండా ప్రాక్టీస్ చేస్తుంది – ఏదైనా "జాబ్" చేస్తుందట... అనేవాళ్లే వుంటారు తప్ప – మావాడు సెకండు షోకి వెళ్ళి వచ్చి పడుక్కొని పొద్దున్న తొమ్మిదిన్నరకి లేస్తాడు. వాడూ రోజూ కాలేజీకి ఫస్టవర్లో టీ త్రాగందే ప్రవేశించడు – లాస్ట్ అవర్లో మిరపకాయ బజ్జీలుంటేతప్ప వాడికి తోచదు– వాడు ఏ సినిమాకైనా మొదటి రోజు మొదటాట చూస్తే తప్ప నిద్రపోడు లాంటివి చెప్పరు కదా!

కాని అబ్బాయిలలో చాలామందికి- జాతీయ క్రీడ ఏదో తెలియదు. తెలిసిన వాళ్లకి దాన్ని దేంతో ఆడులారో తెలియదు – కొందరు జాతీయ క్రీడమీద తమ అభిప్రాయం చెపుతారు. అసలు వచ్చిన చిక్కు అంతా ఆటలాడుకునే ఛాన్సు వాళ్లకి ఒకటోక్లాసు నుంచి, బియ్యే క్లాసుదాకా ఎక్కడా రావడంలేదు. కాలేజీ అయినా ఎలిమెంటరీ పాఠశాల అయినా అది వుండే ప్రాంతం – మన పట్నాల్లో ఒక "టౌన్ కాంప్లెక్సు" లాంటిది అయి వుంటుంది. కాలేజీ వుంటే ఆ ప్రక్కనే సినిమాహాలు, ఆ సెంటర్లోనే టీస్టాలు, నాలుగు మిరపకాయ బజ్జీల దుకాణాలు, చిన్న బార్, ఎడంగా కల్లుకొట్టు – సారాదుకాణం యివన్నీ వుండాలి– కాఫీ హోటళ్ళు దగ్గరలో వుండాలి. ఇలా యివన్నీ వుంటేనే మజా ... కాని యివన్నీ యువకులంతా కోరడంలేదు ... యీ సంఘం వాళ్ల నెత్తిన రుద్దుతున్నది పైగా కాలేజీకి 'బోర్డు' పెట్టేటందుకు జాగా, షెడ్లువుంటే చాలు, కాలేజీలు మొలుస్తున్నాయి ...

దూరంగా ప్రశాంతమైన చోటులో కాలేజీలుండాలి... కిళ్లీ సిగరెట్ల దుకాణాలు దూరంగా వుండాలి... అని అంటే కోపాలొస్తాయి... యువతరం అన్ని అలవాట్లు చవిచూడాలి. రాజకీయాల్లో పాల్గొనాలి ... సినిమా తారల్ని ఆరాధించాలి అనుకరించాలి అని వాదించే వాళ్లెందరో వున్నారు. అలా వాళ్లని తయారు చేయడంలోనే వుంది పెద్ద తరం చాకచక్యం.

ఆటలాడితీరాలి వాళ్ళు, అందుకు గ్రౌండుండాలి – మాగజీన్లలో క్రీడారంగాన్ని చదివే ఆసక్తి అది వేసే ఆసక్తి వుండాలి – అని అరిచేవాళ్ళు వస్తేతప్ప కొన్నాళ్లకైనా, రోడ్డుమీద సెంటర్లో సైకిల్ ఫీట్లు నిజమైన సాహసాలు కావని గ్రహించి, క్రీడారంగంలో "చేవ" చూపాలన్న విషయాన్ని భావి పౌరులు తెల్సుకుంటారు. ఆటలమీద ఆసక్తి వుంటేనే – అవికూడా ఆడితేనే, సర్టిఫికేట్ యిస్తాం ... ఆటలాడినట్లు – మంత్రుల ఎమ్మెల్యేల సర్టిఫికేట్లు చెల్లవు అన్న నిబంధన పెడితేనేతప్ప – మన "యువతరం"కూడా ఆటలలో తమ సత్తా చూపించే రోజు రాదు. తప్పంతా వాళ్లదే కాదు, మన పెద్దతరంది కూడాను...

[వీరాజీ]

సార్...మొబైల్ కోర్ట్సు వ్యాన్.. మన స్టేషన్ముందుంచియున్నది.. దొంగతనం- అయిందని వార్త అందింది..



# బంగాళా దుంపలతో రకరకాల వంటలు

బంగాళదుంపలని ఆలుగడ్డలని కూడా అంటాము. ఈ దుంపలు అన్ని కాలములలోను దొరుకుతాయి. బంగాళదుంపలతో ఎన్నో రకముల రుచి గల పదార్థములను తయారు చేయవచ్చు. ఇక్కడ కొన్నిటిని తెలియ జేస్తాను.

## ఆలుగడ్డ హల్వా :

అర్థశేరు ఆలుగడ్డలు, పావుశేరు చక్కెర, అర్థపావు నెయ్యి, జీడిపప్పు, బాదం, కిస్‌మిస్ కూడా వేసుకోవచ్చు. ఆలుగడ్డలు మంచివి తీసుకుని, నాలుగు ముక్కలుగాకోసి, ఉడకబెట్టి, పొట్టు తీయాలి. ఒల్చిన ముక్కలు రోటిలో వేసి మెత్తగా రుబ్బాలి. చక్కెర లేత పాకం పట్టుకుని, అందులో రుబ్బిన ముద్దవేసి బాగా కలపాలి. సన్నని సెగమీదా, కలియబెడుతూ, నెమ్మదిగా ఉడక నివ్వాలి. కలుపుతూ నెయ్యిపోయాలి. ఒక పళ్లెమునకు నెయ్యిరాసి హల్వాఉడికి గట్టిపడు తున్నపుడుదించి, ఈ పళ్లెములో పరవాలి. పైన, బాదం, జీడిపప్పు ముక్కలు పొడవుగాకోసి, హల్వాపైన అద్దాలి చల్లారిన తర్వాత ముక్కలుగాకోసి, తింటే రుచిగా ఉంటుంది.

బంగాళాదుంపలతో, కారంపిండి వంటలు చాలా రకాలు చేయవచ్చు. ఇప్పుడు కొన్ని మరాటీ వాళ్ళు చేసేవి చెప్తాను.

## మసాలా వడలు :

ఒకపావు ఆలుగడ్డలు, అర్థపావుశనగపప్పు, పచ్చిమిరపకాయలు, రెండు చిన్న ఉల్లిపాయలు అల్లం, కొత్తమిర, మసాలాపొడి, చిన్న (ఎండు) కొబ్బరి ముక్క, ఉప్పు, 1 పావుకిలో నూనె (లేక డాల్డా). ఆలుగడ్డలు ముక్కలుగా కోసి, కడిగి ఉప్పు, చిటికెడుకారం పసుపువేసి ఉడకబెట్టాలి నీళ్ళు ఇగిరిన తర్వాత, దంచి పొట్టు తీయాలి. శనగపప్పు వేయించిగాని, అర్థంగంట నీటిలో నానబెట్టిగాని, మెత్తగా రుబ్బుకోవాలి ఆలుగడ్డముక్కలు మెత్తగా నూరి తీసుకోవాలి. పచ్చిమరపకాయలు, అల్లం, కొబ్బరి మెత్తగా నూరి, ఉల్లిపాయలు, సన్నని ముక్కలుగాకోసి, మరీ మెత్తగాకాకుండా నూరాలి. పప్పులోతప్ప దేనిలోగాని నీళ్ళు చల్ల కూడదు. అన్నీ ఒక గిన్నెలో తీసుకుని తగినంత ఉప్పు, మసాలాపొడి కొత్తిమిరి, ఒక గరిటెడు నెయ్యివేసి బాగా కలపాలి. మసాలావడలు మాదిరిచేసి, డాల్డాలో వేయించాలి.

## కట్‌లెట్ :

శేరు ఆలుగడ్డలు, పావుబీన్స్, పావుటొమాటో, పచ్చిబటాని (క్యాలీఫ్లవరు, క్యాబేజీ ఉన్నా వేయవచ్చు) నెయ్యి, మసాల, అల్లం,వెల్లుల్లి, గసగసాల, కొబ్బరి. ఆలు గడ్డలను ఉడికించి, జిగురు వచ్చే వరకు రుబ్బాలి. టొమాటోపైతోలు తీసి,బీన్స్ అన్నీ సన్నని ముక్కలుగా కోసుకొని, తాలింపు వేసి, మసాలాకూర తయారు చేయాలి.

ఆలుగడ్డ రుబ్బుతున్నప్పుడె కొన్ని ఉప్పువేసి రుబ్బాలి. నిమ్మకాయంత ముద్ద తీసుకుని, అరచేతిలో పూరీ మాదిరిగాచేసి మధ్యన మసాలా కూరపెట్టి మడవాలి. లేదా గుండ్రంగా మూసి డాల్డాలో కాల్చాలి. ఆలు గడ్డలు మెత్తగారుబ్బని యెడల, నెయ్యిలో విచ్చిపోతాయి. కొందరు పెనం మీద కూడా కాల్చుతారు.

## బంగాళాదుంపలు, టొమ్మాటోలతో 'కూర్మా' :

కావలసిన వస్తువులు బంగాళాదుంపలు టమోటో, పచ్చిమరపకాయలు, ఎర్రగడ్డలు (ఉల్లిపాయలు), నాలుగు, పెరుగు అర్థశేరు, జీడిపప్పు,

ధనియాలు, గసగసాలు, దాల్చినచెక్క, లవంగాలు, కొబ్బరి, అల్లం తగినంత

తయారుచేయువిధానము : మొదట బంగాళాదుంపలు ఉడకబెట్టుకుని, పై పెచ్చుతీసి వుంచుకోవాలి. తర్వాత ఆ బంగాళాదుంపలను ముక్కలుగా చేయాలి. టమేటో కడిగి వాటిని ముక్కలుగా తరుక్కోవాలి. ఎర్రగడ్డలు, పచ్చిమిరపకాయలు, పొడుగుగా కోసుకోవాలి. పెరుగు ఒక పాత్రలో పోసుకుని, దానితో తగినంత ఉప్పు కొద్దిగా పసుపుపొడి వేయాలి. కొబ్బరి, ధనియాలు, గసగసాలు, అల్లం, వెల్లుల్లి, కొద్దిగా పచ్చిమిర్చి, అన్నీ కలిపి మొత్తం ముద్దగా నూరుకోవాలి. పొయ్యిమీద వోకళాయి పాత్రనుగాని లేదా స్టెయిన్‌లెస్‌స్టీల్‌గిన్నెగానీ పెట్టి, దానిలో నూనె లేదా, నెయ్యిగాని వేయాలి. బాగా కాగిన తర్వాత జీడిపప్పు, లవంగాలు, దాల్చిన చెక్కవేసి ఎర్రగా వేగిన తర్వాత టమేటో, పచ్చిమిర్చి, ఎర్రగడ్డ ముక్కలు వేసేయాలి. ఇంకొంచెంసేపు అయ్యి పెరుగు, బంగాళాదుంపముక్కలు, మసాలా ముద్ద పోసి గరిటతో కలియబెట్టాలి. అవన్నీ బాగా వుడికిన తర్వాత పుదీనాగానీ, కొస్త కొత్తిమీర గానీవేసి దించుకోవాలి. ఈ బంగాళాదుంపల కుర్మా అన్నంలోగాక పూరీ, చపాతీలలో వేసుకున్నా చాలా బావుంటుంది. అట్టే శ్రమ లేకుండా చేసుకోవచ్చు.

## బంగాళాదుంప పకోడీల కుర్మా :

శనగపప్పు పావుశేరు. బంగాళాదుంపలు, టమోటాలు (చేసుకోనేదాన్నిబట్టి), అల్లం, పచ్చిమిరపకాయలు, పెరుగు అర్ధశేరు, ఎర్రగడ్డలు, జీడిపప్పు, నెయ్యి.

శనగపప్పు నానబెట్టి రుబ్బుకోవాలి. రుబ్బిన శనగపప్పుతో సన్నగా తరిగి దంచిన 'అల్లం లవంగాలు, యిష్టముంటే కరివేపాకు వేసుకోవాలి. బంగాళాదుంపలు వుడకబెట్టి, తోలు తీసాక ముక్కలుగా కోసుకోవాలి. టమేటో ముక్కలు చేసుకోవాలి. వెడల్పాటి కళాయిగిన్నెలో నేయిలేక డాల్డావేసి, బాగా కాగిన తర్వాత ఎర్రగడ్డ పచ్చిమిర్చి ముక్కలు, లవంగాలు, టమేటో పోసి, బంగాళదుంప ముక్కలువేయాలి. గసగసాలు ధనియాలు, అల్లం, కొబ్బరి, మసాలా ముద్దగా నూరి, దీనితోవేసి కలియబెట్టి, వుడకనివ్వాలి కొద్దిగా నీళ్ళు ఎక్కువగా వుంచేనే మంచిది. తర్వాత రుబ్బిన శనగపప్పుతో వడలుకాల్చి, వడలు వేడివేడిగా వున్నప్పుడే ఈ పెరుగులో వేయాలి వడలు పెరుగులోనాని బాగా ఉబ్బుతాయి. పెరుగు బాగా పీల్చుకుంటుంది. కాబట్టి కొస్తనీరు ఎక్కువగా వుంటే మంచిది. ఈ బంగాళా దుంప పకోడీలకుర్మా కూడా చాలా బాగుంటుంది. మసాలా దినుసులవల్లె కుర్మాకు రుచి వస్తుంది.

**— వి. మాధవీలత.**



సాహిత్యంలో 1976 నోబెల్ బహుమతి నందుకున్న అమెరికన్ నవలా రచయిత సాల్ బెల్లో.

## అవీ—యివీ—అన్నీ

డా. కుటుంబరావు

గుడివాడలో డా. గురురాజ ప్రభుత్వహోమియోపతి కళాశాల ప్రిన్సిపాల్ ఆసుపత్రి సూపరింటెండెంట్ అయిన డా. ఎం. కుటుంబరావుకు



హోమియోపతిలో ఎం. డి. (గౌరవ డాక్టరేటు పట్టా)ని యిచ్చి పశ్చిమ బెంగాల్ హోమియోపతి కవున్సిలు సత్కరిస్తున్నది. డా. కుటుంబరావు యింగ్లీషు వైద్యంలో కూడా పట్టభద్రుడు వివిధ రాష్ట్రాలలో హోమియో వైద్య అభివృద్ధికి జరుగుతున్న కృషిలో కూడా యీయనకి సంబంధమున్నది.

(ఆం. ప. గుడివాడ విలేఖరి)

## కోయంబత్తూరు ఆంధ్రులు

కోయంబత్తూరుకు ఆంధ్రప్రదేశ్ విద్యా సాంస్కృతిక శాఖామాత్యులు శ్రీ మండలి వెంకట కృష్ణారావు యిటీవల వచ్చిన సందర్భములో స్థానిక తెలుగు సాంస్కృతిక సంఘం వారు ఏర్పాటుచేసిన సభలో వారి సాధక బాధకాలను తెలుసుకొన్నారు.

కోయంబత్తూరులో తెలుగు జనాభా అధికంగానే వున్నప్పటికీ తమ మాతృభాషాభివృద్ధికి కావలసిన వనరులు స్వల్పంగా వున్నవని, తమ గ్రంథాలయానికి పుస్తకాల కొరత, సంఘ కార్యకలాపాలు జరుపుటకు భవనాల కొఱత వుందని తెలిపారు.

శ్రీ మండలి వారి కోర్కెలను శ్రద్ధగా పరిశీలించి, తగువిధమైన సహాయం అందజేయగలమని, ప్రభుత్వంకూడా ప్రవాసాంధ్రుల అభ్యున్నతికి శ్రద్ధ వహిస్తుందని హామీ యిచ్చారు. [ఎం.వి.]

## హైదరాబాద్ నోట్‌బుక్

(6 వ పేజీ తరువాయి)

నిక విద్యావిధానం యువకులను దేశ సంస్కృతినుంచి దూరం చేసింది. కనుక జాతీయ సమైక్యానికి, సాంఘిక వగాహనకు దోహదకరమైన మార్పులు విద్యావిధానంలో జరగాలి" అని ఆయన నొక్కి చెప్పారు.

**జంట నగరాలకు మరికొంత వెలుగు**

జంట నగరాలను మరింత కాంతివంతం చేయడానికి నగరాభివృద్ధి సంస్థ 16 కోట్ల రూపాయల వ్యయంతో అంచెంవారీగా విద్యుత్దీప కర్యం కలిగించే పథకాన్ని అమలు పరచనున్నది. 200 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణం వున్న జంట నగరాలలో 60 వేల దీపస్తంభాలు న్నవి. వీటిలో 34 వేల స్తంభాలకు మాత్రమే బల్బులు, ట్యూబ్‌లైట్లు, మెర్క్యురీ దీపాలు ఉన్నాయి. కాని నగరం దినదినాభివృద్ధి చెందుతుండడంవల్ల దీప సౌకర్యం ఎక్కువగా కలిగించవలసి వున్నందున కొత్త పథకం అంచెంవారిగా అమలు అవుతుంది.

**ఉపశ్రుతి :**

"కాలాహోస్ మీద బిర్లా సంస్థ కట్టించిన వెంకటేశ్వరాలయానికి దాదాపు కోటి రూపాయలు పట్టిందట" అన్నారు. ఒకరు ఒక సంభాషణలో. "డబ్బు సంగతి ఎందుకు ? ఆలయం బాగుందంటే చాలదా!?" అన్నాను నేను. "చాలదు!" అన్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మాజీ ప్రధాన కార్యదర్శి శ్రీ కె. ఎస్. అనంతరామన్ "ఎందుకండీ ?" అడిగారు ఒకరు. "మనిషి ప్రతిదాన్నీ డబ్బులో కొలుస్తాడు. చోళ రాజా చిదంబరం దేవాలయానికి బంగారుపెంకులు వేయించాడట. అప్పుడది పొన్నంబలం- బంగారు దేవాలయం అయింది. నటరాజస్వామి బంగారు పెంకులు వేయించమన్నాడా మహారాజా ? అని ఎవరో అడిగారట దానికి మహారాజు వెర్రివాడ, నటరాజస్వామి వేయించమనలేదు. జనం ప్రతిదీ బంగారంతో కొలుస్తారు. బంగారు దేవాలయం అనే భావంతో నైనా భగవంతుణ్ని ఒకసారైనా స్మరిస్తారని నేనే అలా చేశాను అన్నాడట." అని శ్రీ కె. ఎస్ అనంతరామన్ గొప్ప పూర్వోదంతం చెప్పారు. నేను గౌరవంతో మహాశయునికి నమస్కారం చేశాను.

—తిరుమల రామచంద్ర



# యువతరం ★

[స్టాంపు కింద]రం డి. ఎస్. ఆర్. కళాశాలలో బి. ఏ. ఫైనల్ ఇయర్ చదువుకుంటున్న సోమంచి రాధారాణి ఈ మధ్య సినీనటి శారద వాళ్ల వూరు వచ్చినపుడు కొందరు స్నేహితురాళ్లతో కలిసి ఆమెను ధైర్యంగా ఇంటర్వ్యూ చేసేసింది. ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలో తమ వూరి మహిళల తరపున పాల్గొన్న తనకు మంత్రులని చూడాలన్న సరదాకూడా తీరిందట.



"లైబ్రరికి పోను. ఎందుకంటే నేను వెళ్లేగి మా కాలేజీ లైబ్రరీకి. నవల్స్‌కోసం బుక్స్ పైన చేయివేస్తే, క్లాస్ బుక్స్ తగుల్తుంటాయి. వాటిని చూడగానే గాభరా కల్గి, వెంటనే ఒక 'టా టా' చెప్పి ఇవతలి కొచ్చి ఆ బ్రైవ్‌లో హాయిగా కాలేజీ కాంపస్‌లో ఫ్రెండ్స్‌తో చక్కర్లు కొడతాను" అంటున్న ఈ అమ్మాయికి ఫొటోగ్రఫీ హాబీ. సరదాగా పండుగలకి పేకాట్టం అన్నా ఇష్టమేనట. కాని గారడీల మీద సరదా లేదు.

భాషా బేధం లేకుండా వినోదాన్ని కల్గించే అన్ని సినీమాలు చూస్తాను అన్న ఈ అమ్మాయికి పొరుగింటి పుల్లకూర చిత్రంలోని జయచిత్ర జరిపిన ఇంటర్వ్యూ సన్నివేశం నచ్చిందట!

'నాకు రాజకీయాలంటే చాల ఇష్టం. పేపర్లో ఆ రోజు పడ్డ కార్టూన్ ముందుగా చూస్తాను' అంది. 'బియ్యం మానేసి గోధుమలు తినమంటే అది ఆంధ్రావాళ్ల అభిమానానికి సవాల్ అంటాను' అంటున్న ఈ అమ్మాయి కొంతకాలం క్రితం ధరలు పెరగటానికి కారణం చెప్పలేనంది. చాల "ఫేమస్ పర్సన్"ని అవాలని అందరికీ వుండే ఆశయమే నాకూ వుంది అంటోంది రాధారాణి. —సు.

## సినిమా

22.10.1976 పత్రికలో లేఖలశీర్షికలో సోదరుడు జి. సురేష్, జనగాం ఉత్తరంలో తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. కానీ ఈ క్రింది విషయాలను గురించి ఆలోచిస్తే తమ అభిప్రాయాన్ని మార్చుకుంటారని అనుకుంటాను.

శ్రీ రామారావుగారు ఏదో అధికారంతో కలక్షన్లు వేయించుకుంటున్నారని అన్నారు. ఎవరయినా వచ్చిన కలక్షన్లే కదా ప్రకటించేది. ఈ విధంగా శోభన్‌బాబుగారి జీవనతరంగాలు, సోగ్గాడు, బాబు, జేబుదొంగ మొదలైన చిత్రాలకు కూడ కలక్షన్లు ప్రకటించారు. కదా! ఇవి అన్నియు నటరత్న కలక్షన్లలో పోటీపడలేకపోయాయి కదా! ఇది అందరికి తెలిసినవిషయం.

ఇటువంటి విషయాలలో నటరత్న జోక్యం చేసుకోరు. ఇంకా శోభన్ బాబుగారే ప్రేమనగర్ కలక్షన్లకన్నా తమ 'సోగ్గాడు' చిత్రానికి కలక్షనులు ఎక్కువగా వచ్చినవని పత్రికా ప్రకటన చేశారు. ఇటువంటి ప్రకటనలు నటరత్న ఎన్నడూ ప్రకటించలేదు. అన్ని పత్రికలు నటరత్న చిత్రాలకు వసూళ్లు బాగున్నవని వ్రాస్తున్న విషయం అందరికీ తెలిసినదే. శ్రీనివాస్‌గారు కూడా ఈ విషయం వ్రాయుటంలో తప్పేమీ లేదు.

ఆయన నటరత్న చిత్రాలకే కాదు దెబ్బతిన్న

## ఉత్తరాలు

(5వ పేజీ తరువాయి)

పిచ్చిమారాజా, ప్రేమ బంధం చిత్రాలకు లాభాలు వచ్చాయని వ్రాశాడు, ఇవన్నియూ పక్షపాత వైఖరితో వ్రాసిన వేనా?

ప్రసాదు, కరుణాసాగర్, రెడ్డిబృందం (హైద్రాబాద్)

* * *

దీపసుందరి అరుణాఇరానీ ముఖచిత్రంతో వెలువడిన "దీపావళి సంచిక" సర్వాంగ సుందరంగా వుంది. కథల్లో గొడుగు, ఇంకోసరిత కథ ఈ రెండూ చాలా బాగున్నాయి. సినీన్యూస్‌కింగ్ శ్రీనివాస్‌గారి నిష్పక్షపాతమైన సినిమా విశేషాలు మమ్మల్ని చాలా ఆకర్షిస్తున్నాయి.

ఎ. సుగుణాకర్ (అనంతపురం.)

* * *

22.10.76 పత్రికలో జనగామ్ పాఠకుని ఉత్తరం చదివి, నవ్వుకున్నామంటే నమ్మండి. శ్రీనివాస్‌గారు అభిప్రాయాలు చాలా చక్కగా వ్రాస్తారు. కనుక మార్చుకోనవలసినది లేదు. వాస్తవంగా ఎన్. టి. ఆర్. గారి చిత్రాలకు వసూళ్లు బాగా వస్తాయి, అనుటలో సందేహం లేదు. అది జగమెరిగిన సత్యం, ఇక పోతే దినపత్రికలలో వసూళ్లవివరాలు వేయిస్తారు రామారావుగారు, శోభన్‌బాబుగారు వేయించరు అని. దీనినిబట్టి పాఠకుని విమర్శ సద్విమర్శకాదని తెలిసిపోయింది. హీరోలందరి కొన్ని సినిమాల వసూళ్ళ వివరాలు పేపర్లో వచ్చాయి. ఉదాహరణకు జీవనతరంగాలు వసూళ్ల వివరాలు పేపర్లో వేశారు. ఈ వివరాలు వేయించేది కూడా హీరోలు కాదని, నిర్మాతలు— లేక డిస్ట్రిబ్యూటర్లు అని గమనించాలి. పూర్తిగా తెలిసికోనక మిడిమిడి జ్ఞానముతో విమర్శించుట తగదు.

ప్రకాశ్, మునుగోడు, (నందిగామ.)

## కథలు

22.10.76 తేదీ వారపత్రిక లో ప్రచురితమైన శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావుగారి కథ "ఎక్కడికీ పయనం" చాల న్యాచురల్‌గా వుంది. "కరేపాకు" పాత్ర చిత్రీకరణ చాల బాగుంది. కన్నీరు కార్పించింది. ఇటీవల యింత మంచి కథ ప్రచురించబడలేదు. రచయిత గారికినా హృదయపూర్వక ధన్యవాదాలు. వారి కలం నుంచి యింకయిలాంటి కథలు వెలువడగలవని ఆశిస్తాను.

కె. వి. నాగేశ్వరరావు, (నార్సరాజపాలెం)

## దీపావళి

ఈ వారం "దీపసుందరి" ముఖచిత్రంతో వెలువడిన దీపావళి సంచిక చాలా బాగుంది. ప్రత్యేక సంచికంటూ మూల్యం పెంచక సంచికను అదే మూల్యం, ఎక్కువ పేజీలతో అందించినందుకు మా యొక్క కృతజ్ఞతలు. బహుమతులు పొందిన మూడు కథలు బాగున్నా వాస్తవానికి దగ్గరగా సహజంగా ఒక్కకథ కూడా లేకపోవడం శోచనీయం. క్షయవ్యాధి గురించి శర్మగారు చక్కని విషయాలు అందిస్తున్నందుకు వారికి మా కృతజ్ఞతలు.

కె. చిన్నయ్య, వై. ఎ. కుమార్ (గన్నేరువరం.)

## అట్టమీదబొమ్మ

నా అభిమాన నటి వాణిశ్రీ ముఖచిత్రంతో వెలువడిన పత్రిక నాకెంతగానో నచ్చింది. ధర్మపథం, మమ్మమ్మ మొద్దంటే చేదా? వీరాజీగారి "సామాన్యుడి సణుగుడు," మన సినిమాలలో తెలుగు భాష మహమ్మద్ నఫీజుద్దీన్‌గారి వ్యాసము ఎక్సలెంట్.

ఎస్. శ్రీనివాస్, (నూజివీడు.)

## చిరస్మృతి

1.7.1959 ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురితమయిన చిరస్మృతి కథానిక రచయిత అయిన 'విశాఖ' గారి చిరునామాను, వారుగాని వారి నెరిగిన వారు గాని వాకాటి పాండురంగారావ్ ఇ—2, పోర్ట్ ఏరియా, విశాఖపట్నం—530001. అన్న చిరునామాకు తెలుపవలసిందిగా మీ పత్రికా ముఖంగా విజ్ఞప్తి చేస్తున్నాను.

వాకాటి. పాండురంగారావు. (విశాఖ) ●

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

# ఇంటి గుమ్మాన్ని చూచి



# ఇంటిని చెప్పవచ్చు

**విశ్వప్రేమి:**
ఇంటికి అందరూ రావాలి అంటుంది.
కొలువు అయిన తరువాత అవిడ చావడి
శుభ్రంగా తీర్చి దిద్దినట్లుంటుంది.



**విశ్వప్రేమి:**
వాస్తవంగా అతిథులను ఆహ్వానించడం
తెలుసు. చీకూచింతా వుండదు. ఇల్లు
ఎప్పుడూ శుభ్రంగా ఉంటుంది.




**విశ్వప్రేమి:**
ప్రతీవ్యక్తికి ప్రేమతో స్వాగతము
పాలవాడికి కూడా.



**విశ్వప్రేమి:**
కొడుకు స్నేహితులందరూ
కాళ్లుతుడుచుకొని వస్తారు లోపలకు



**స్వాభిమాని:**
కూపస్థమండూకము గుమ్మలలోకి ఎవర
వచ్చినా విసుగు. ధూళి, మన్ను
తెస్తారని గొణుగుతుంది.



ఇరుగుపొరుగువారి దగ్గరనుంచి. ఈవిడ
కొన్ని విషయాలు నేర్చుకోవచ్చు —
ఉదాహరణకు కాళ్లుతుడుచుకొనే కోయర్
డోర్ మ్యాట్సు వాటి ఉపయోగము.

## కోయర్ డోర్ మ్యాట్సు

ఎంతతొక్కినా అందంచెడని డోర్ మ్యాటులు.



కోయర్
బోర్డు
కొచ్చిన్ 682016

త్వరగా కోయర్‌కి అలవాటు పడండి దగ్గరి కోయర్ డీలర్ దగ్గరికి వెళ్లి.
కోయర్ బోర్డు షోరూమ్ & సేల్స్ డిపో, బొంబాయి, న్యూఢిల్లీ, కలకత్తా,
మద్రాసు, బెంగళూరు, కొచ్చిన్, మధురై, ఛండీఘర్, భువనేశ్వర్, పాట్నా
హైదరాబాదు, మరియు దేశమంతటా అనుమతిపొందిన కోయర్ డీలర్లు.

SISTA'S CR 4/75 TEL




నిర్మాత: ఎన్.కృష్ణంరాజు దర్శకత్వం: సింగీతం శ్రీనివాసరావు

Nandi

అన్నపూర్ణా విడుదల

ANNAPURNA